ఆంధ్రవిజ్ఞానసమితి నెం ౨౮

# విస్మృతకళింగాంధ్రకవులు

## ప్రథమ భాగము.

కృతికర్త

శ్రీ అడిదము రామారావుపంతులుగారు,

(హైస్కూలుసీనియరు తెలుగుపండితులు, శ్రీమహారాజావారి కాలేజి, విజయనగరము

ఉపాధ్యక్షులు, ఆంధ్రవిజ్ఞానసమితి )

ప్రకాశకులు

ఆంధ్రవిజ్ఞానసమితి,

విజయనగరము.

# విజ్ఞప్తి.

---

పరిమళములలోఁ గస్తూరి, తరువులలోఁ జందనంబు దైవంబులలో
బరమేశుఁడు విద్యలలో, నరయంగాఁ గవితయెక్కుడగునని రాయల్

సమగ్రమును, సప్రమాణమును, శాస్త్రీయమును నగు వాఙ్మయచరిత్రమునకుఁ గవులచరిత్రము ముఖ్యాంగము ఆంధ్ర వాఙ్మయమునఁ గవులచరిత్రములు సంపూర్ణముగ లేవు ఆంధ్ర కవులజీవితచరిత్రములను నధునాతనపథకమునఁ దొలుత శ్రీ గరుజాడ శ్రీరామమూర్తిపంతులువా రుద్యమించి, కతిపయ చరిత్రలను రచియించిరి ఆవెనుక శ్రీకందకూరి వీరేశలింగము పంతులువారు ఆమార్గమునఁ బెక్కుచరిత్రలను బ్రకటించిరి వీరిరువురు వ్రాసినగ్రంథములలోఁ గవికులగోత్రభేదవిచారణ, కాలనిర్ణయచర్చ, గ్రంథకర్తృత్వవివాదము, మున్నగునవి హెచ్చుగానుండి, సాహితీపరిశ్రమమునకు గాని, సారస్వతచరిత్ర మును గాని, నెఱుంగుటకు నాగ్రంథములు సహాయకారులుగ నుండలేదు అయినను, తమకాలమునఁ దమకు లభ్యమగుసాధనసంపత్తితోఁ గవిజీవితములను రచియించి, నేఁటివఱకుఁ దమ గ్రంథములే యాధారములైనట్లు వెలయించినవారిరువురకు మన మెంతయేని కృతజ్ఞతచూపవలసియున్నది వారికాలమునకంటె

నిప్పుడపారముగ, కవులచరిత్రలనుఁ గూర్చి సాధనములు లభించుచున్నను, సంపూర్ణముకు, సప్రమాణమును, చారిత్రకవిమర్శశోభితమును నగు కవులచరిత్రము నేఁటికిని మనకుఁ గొఱఁతయేకదా !

సంపూర్ణాంధ్రకవిచరిత్రమునకు నాయామండలముల యందలి కవులగూర్చినచరిత్రములు దొలుత బూర్తిగఁ బ్రకటింపఁబడవలయును ఆయాప్రాంతములనున్న కవులఁగూర్చి, తత్తత్ప్రాంతవాస్తవ్యులెఱుంగునట్లు పైవారెంత పరిశ్రమముఁ గావించిన నెఱుఁగుట తటస్థింపదు. ఇంకను, దూరస్థులగుచో మనయజ్ఞానముచే వారినిఁగూర్చి లేనిపోని విషయములుకూడ వ్రాయుటయగును ఇట్టిలోపములు పూర్వకవిచరిత్రలను జూచిన నెన్నియేని కానవచ్చును మఱియు, జరిత్రకెక్కకుండ సంప్రదాయసిద్ధమై యాయాకవికుటుంబముల నిలిచియుండు చారిత్రకవిషయము లాస్థలజ్ఞులకుఁ దెలిసియున్నట్లితరులెఱుంగుటయు వీలుపడదు కావున, నేయేమండలమువ రాయామండలములఁగల కవులచరిత్రలను, గ్రంథములను, సేకరించి, కవిచరిత్రలు ప్రకటించినచో నాంధ్రవాఙ్మయచరిత్రమునకు వారు మేలొనగూర్చువారగుదురు మఱియు, నాంధ్రతనుగోరు నిక్కాలమున నిది వారికర్తవ్యమని మాయభిప్రాయము

ఇట్టియుద్దేశములతోఁ గళింగదేశమందలి సుప్రసిద్ధులగు కొంతమంది కవులఁగూర్చియీతొలిభాగము ప్రకటింపఁబడినది

కాలక్రమమున తక్కినభాగములు వెలువడగలవని యుద్దేశించు చున్నారము ఈభాగమున కేవలము, కాలనిర్ణయాదులేగాక, కవికృతకావ్యమునుగూర్చి విమర్శన దృష్టితోడను, నుదాహరణములతోడను పెక్కువిషయములు సంతరింపబడి, కవికిని, కావ్యమునకును సమానప్రాధాన్య మొసంగబడినది ఆంధ్రసాహితీవేత్త లావిషయమును గమనింతురుగాక!

కృతికర్తలగు శ్రీ అడిదము రామారావుపంతులువారు సుప్రసిద్ధకళింగాంధ్రకవికుటుంబమునకుఁ జెందినవారగుటచే సంప్రదాయసిద్ధముగను పట్టభద్రులకుఁ బాఠములుచెప్పినవారగుటచే, నద్యతన చారిత్రకవిమర్శనపద్ధతుల కనువగునట్లును, నీగ్రంథమును రచియించి మాసమితి కొసంగినందు కెంతయు కృతజ్ఞులము

ఇట్లే మనయాంధ్రదేశమున నాయామండలములవారు తమమండలకవులచరిత్రములను బ్రకటించి యాంధ్రభాషాభ్యుదయమునకుఁ దోడ్పడుదురేని మాయాంధ్రవిజ్ఞానసమితి పరిశ్రమము సార్థకమై, మాయాశయములు సఫలీకృతము లగునని విన్నవించుచున్నారము

ఇట్లు,

విజయనగరము,
1-6-1940

వేదకొమ్మ గురువేంకటసుబ్బయ్య,
అధ్యక్షులు

ఆంధ్రవాఙ్మయ ప్రపంచమున

కవులజీవితచరిత్రములను వెలయఁజేసిన,

కీ॥ శే॥ రావుబహద్దూరు,

శ్రీ కందుకూరి వీరేశలింగం పంతులు,

శ్రీ గురుజాడ శ్రీరామమూర్తిపంతులు వార్ల

స్మారకచిహ్నముగ నీకృతి యర్పింపఁబడినది

కృతికర్త

# పరిచయము.



ఈవ్యాసగుచ్ఛమునకు 'ముందుమాట'' వ్రాయుమని నియోగించి యీసమితికార్యకర్తలు నాకుచేసిన గౌరవమునకు నేనువారికెంతయు కృతజ్ఞుఁడను ఈకృతివిశేషములు కొన్నిమనవి చేస్తాను చదువరులు గమనించతగినవి

ఈవిశాఖపట్టణముమండలములో బ్రాహ్మణకుటుంబములలో నార్వేలనియోగులలో అడిదమువారు కవికులతిలకులై ప్రఖ్యాతిగన్నవారు వారిలో మ॥ రా॥ రా॥ శ్రీరామారావుపంతులుగారు, ఈగ్రంథరచయిత, శ్రీ శ్రీ శ్రీవిజయనగరం మహారాజావారి ఆంగ్లకళాశాలలో "డిగ్రీ'' క్లాసులకు ప్రధానాంధ్రపండితులుగానుండి, పాండిత్యవిలసితమును, విమర్శావిశిష్టమును, నాగరకమును,అయినబోధనావిధానముచే చాలమంది విద్యార్థులను తరింపఁజేసి ,ఆంధ్రాయూనివర్సిటీ (వాల్తేరు)లో పాఠ్యనిర్ణాయకసభకును, పరీక్షాధికారిత్వమునకును ఎన్నికగనియాంధ్రోపాధ్యాయులలో మాననీయులైరి ఇట్టిప్రవృత్తియందుండియే కొన్నిసంవత్సరములక్రిందట "ఆంగ్లకవి జీవితములు'' (English Men of Letters) మార్గమున "అడిదముసూరకవి'' జీవితమును విపులముగా రచించిరి అది యాంధ్రులనుతికెక్కినది శ్రీకందుకూరి వీరేశలింగంపంతులుగారును, శ్రీగురు

జాడ శ్రీరామమూర్తిపంతులుగారును మాకు మునుపటతరము వారు, ఆంధ్రకవులచరిత్రములు" జీవితములువ్రాసిరి అవి పార్శ్వ గ్రంథములుగాచెప్పిన శ్రీరామారావుపంతులవారు రాఘవక్క నవ లంబించి, ఆగ్రంథములోని కెక్కియుండని యీప్రాంతపుకవుల జీవితములు వ్రాయుట కుత్సహించిరి అందుకువలయు తాళప త్రప్రతులు మొదలైనవి వారికి సహచరులమగు మిత్రచ్ఛా త్రులము కొన్నిసంపాదించి యిచ్చితిమి కాగా యీవ్యాసావళి ప్రచురణకు వచ్చినది ఆయాపత్రికాధిపతులు వీటికి తావిచ్చి గౌరవించిరి అవియన్నియు నిప్పుడీవిద్యాసమితివారి సమాదర ణమున నీకృతిరూపమున ప్రకటింపబడుచున్నవి

ఈవ్యాసములు దిఙ్మాత్రవిషయ నిరూపణముగలవై, మార్గోపదేశమాత్రకములేయై, వర్ణితాంశముల విపులవిమర్శ లను సూచించునవైయున్నవి తాడూబొంగరములేని, కేవల యూహామాత్రమై సాహిత్యవినోదమునకైనా తాడూబొంగర ము కల్పించుటయన్నదికూడా యెన్నికైన చాకచక్యమే అగ మ్యగోచరమై అడివిబలిసిపోయి విస్మృతమైన ప్రాంతములో విజ్ఞానమరములజాడలలో బయలుదీయగలుగుట ప్రయత్న మాత్రమేఅయినా విజ్ఞానపరిషత్తులం దుగ్గడింపబడుచున్నది ఈ వ్యాసావళియందలి ప్రయత్నమున్ను అట్టిదేకాగా దీనివల్ల శ్రీ భారతీతీర్థకుల పత్యధిరాజులగు శ్రీశ్రీశ్రీ విక్రమదేవవర్మ మహారాజాసాహిత్య సమ్రాట్టువారి ప్రశంసయు శ్రీవారివల్ల

"ఎమర్స్యావిశారద' బిరుదపట్టమును శ్రీ రామారావు పంతుల గారికి లభ్యమైనవి తాటాకుముగా మాదిననేంల 'ఆంధ్రకవులు తుని కుత్తరముగాగల ఆంధ్రకుటుంబములలో నెల్లుఖలేరనియు కళింగమను నిప్రాంతమునో నాలుకలోనుండినభాష ఆంధ్రాపభ్రంశమనియు, కృష్ణాగోదావరీమధ్యగల ఆంధ్రవిమర్శకుల భ్రమప్రమాదజనితము అపవాదమును" కీకృతిజబాబు ఆ విమర్శకులు నన్నయతో సమకాలికమగు కళింగమండలశాసనములలో "నన్నయపేరులు వంటి సీసపద్యములు కనపడుట అనేక పత్రికలలో ప్రకటితమయ్యుండినను తమతమ వాసస్థలముల యొందలి గురుత్వముచేత నిరాశమును మరచుమందరు శ్రీరామారావుగారు 'అడిదము సూరకవి' అనుకృతిని ప్రకటించినతరువాతకూడా చెన్నపురిప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారము గ్రంథసూచికలు (Catalogues) తద్రచయితలు సూరకవిగారిని "గోదావరిజిల్లా రామచంద్రపురం"వారినిగా చేర్చినిరి ఈకారణముచేతనైనా యీకృతి బహూకరింపతగినదే ఆంధ్రనారస్వతములో బలిచియుండతగినదే గాంచవలసినదే

కాని మరియొకమాట పరమార్థవిషయము, పౌరుషశివనులమగు మాబ్రాహ్మణనియోగిజాతములకు "జీర్ణోద్ధారకము' విధిగా మానవంశీయులలో ప్రసిద్ధపురుషులర్తి విశేషమై, మాకు వంశపారంపర్యమగు నపదేశమైయున్నది అది సప్తసంతానములలో గణనీయమగు కృతిరూపమును నిరుము నిర్వహించి, కళిం

గాంధ్రకవుల సుకృతముల నుద్ధారణలోనికి తెచ్చు "పరిచయవ్యాఖ్యములు" వ్రాసి శ్రీ రామారావుపంతులుగారు తమ అడిదము వారి బిరుదు సమర్థించి, జీవితపారమార్థికమును సాధించినారు ధన్యులు వందనీయులు

భారతీతీర్థము
విజయనగరం,
24 5-1940

ఇట్లు బుధవిధేయుడు,
బుర్రా శేషగిరిరావు,
ప్రధానిశేఖర, ఎం ఏ, పి ఎచ్ డి డి లిట్, ఎం ఎస్ ఎ



శ్రీ రస్తు

# పీఠిక.

చాళుక్యనృపుఁడు రాజరాజు కాలమగు క్రస్తువెనుక 11 వ శతాబ్దమునాఁటికే యీప్రాంతమగు కళింగదేశములో నన్నయ భట్టు సీసపద్యములవంటి పద్యములు శాసనములలోఁ గానవచ్చుచున్నవనుటకు గంజాంమండలములోని నరసన్నపేటకు సమీపముననున్న "దీర్ఘాసి" గ్రామములోని శిలాశాసనము నిదర్శనముగానున్నది దీనికుపబలముగా 18 వ శతాబ్దమధ్యభాగమున జీవించియున్న ఆడిదము సూరకవి చాటుపద్యమొకటి కళింగదేశాంధ్రవాఙ్మయాభివృద్ధిని సూచించునదిగా నున్నది—

చ "ఇరువదిమూఁడు పూరుషము లిప్పటికయ్యెఁ గవిత్వవృత్తిచే
నరపతులెల్లమెచ్చ నిరునాల్గుకరంబులు మించి పిమ్మటన్
వెరపగు జవ్వనస్థితి లభించుట, తొమ్మిదియయ్యెఁ బూరుషాం
తరములు నీకళింగవసుధాధిపుచెంగట నాశ్రయించుటల్"

అనినిబట్టి యాలోచింపఁగా నన్నయకాలమునుండియు నీప్రాంతమగు కళింగదేశములో నాంధ్రసారస్వతము వెలసి ప్రచారములోనున్నట్లుగ నూహింప వీలగుచున్నది సూరకవికి ముందుఁ దొమ్మదితరములనుండి యతనివంశమువారు కవితావృత్తిచేఁ గళింగరాజులయాశ్రయము గలిగియుండిరనియు, నంతకుఁబూర్వము పదునాలుగుపురుషాంతరములనుండి యతని వంశజులు కవితావృత్తిచేతనే జీవనోపాధి కల్పించికొని యుండి

రనియుఁ దెలియుచున్నది అంతియగాక యీకళింగరాజ్యములోని రాజులు-శ్రీవిజయనగరము పూసపాటివారు, బొబ్బిలి రావువారు ప్రాచీననందాపురాధీశులు (ఇప్పటి జయపురపరిపాలకులు) పర్లాకిమిడి ప్రభువులు, మున్నగుభూపాలులందఱును నాంధ్రకవిత్వము నాదరించి, కవులను పోషించుచువచ్చినట్లుగా నిదర్శనము లుంటచే నాంధ్రదేశమందలి యితరసీమలవలె నికళింగదేశము కూడ వాఙ్మయాభివృద్ధికిఁ దోడ్పడినదనియు సారస్వతచరిత్రమున నగ్రస్థానము నాక్రమించు కవిపుంగవులిచ్చట వెలసిరనియు నిరాక్షేపముగాఁ జెప్పవచ్చును శ్రీకృష్ణదేవరాయలజనకుఁడగు వీరనరసింహరాయల యాస్థానకవియగు "మాదయ్య"యను నాతఁడు కళింగసీమకు వచ్చినప్పుడు, నందాపురాధీశులును, పర్లాకిమిడిప్రభువులును నతనిని సమ్మానించినట్లుగా నీక్రిందిసీసపద్యపాదములవలన స్పష్టమగుచున్నది -

'కాంచినాఁడవు కనత్కాంచనాభరణంబు
　　లేపారనందాపురీశుచేత
అందినాఁడవు నుత్తమాశ్వద్వయంబును
　　కిమిడిభూమండల రమణుచేత

గీ

ప్రోడవన్నింట సర్వయమాదసుకవి"

ఇట్టినిదర్శనములున్నను ప్రాచీనతరములగు గ్రంథములు అనఁగా 12-15 శతాబ్దముల మధ్యకాలమున రచియింపఁబడ్డవి

దురదృష్టవశమునఁ గాలగర్భమునఁబడి ఖిలమైపోయి యుండ వచ్చును లేదా క్రిమిదష్టములగుచు, శిథిలావస్థలో నేగ్రామ మునందైనను గుప్తములై యుండవచ్చును

యుగపురుషుఁడని "ఆంధ్రవాఙ్మయచరిత్రము" నందుఁ బ్రసిద్ధిఁగాంచిన కీ శే రావుబహదూరు కందుకూరి వీరేశలిం గముపంతులవారి కవులచరిత్రమును, ప్రప్రథమమునఁ గవిజీవి తములు వ్రాసి యాంధ్రలోకమునకుఁ జవిఁజూపిన కీ శే గురు జాడ శ్రీరామమూర్తిపంతులవారి గ్రంథమును చదివినపిమ్మట నీమహనీయు లిరువురకును కళింగదేశకవుల చారిత్రాదికములు లభ్యముకాలేదన్న సందియము కాలేజీలో విద్యార్థిగానున్న కాలముననే నాకుఁ గలిగినది ఇటీవల 10-15 సంవత్సరముల నుండి యీ"విస్మృతకళింగాంధ్రకవుల" కృతులను సంపాదించు టయందును, వారిజీవితచరిత్రములను సేకరించుటయందుచు, కృషిచేసి కొంతవరకుఁ గృతార్థుఁడనైతిని నేఁజేసినపరిశోధనా న్వేషణముల ఫలితమే యీవ్యాసావళి ఈవ్యాసములలో కొన్ని " ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక " లోను శ్రీవిజయన గరం మహారాజావారి "కాలేజీమాగ్జిన్' లోను నప్పుడప్పుడు ప్రచురించుచు వచ్చితిని వాటిపైని విద్యాధికులు కొందఱిడిన యమూల్యాభిప్రాయములే నాయుద్యమమున కధికప్రోత్సా హాకరములైనవి

ఇప్పుడు శ్రీరామచంద్రుని కరుణాకటాక్షము చేతను, నాయందు గౌరవాభిమానములుగల పెద్దల యాశీర్వాదము చేతను, "ఆంధ్రవిజ్ఞానసమితి"కి నధ్యక్షులును, నాకుఁ బరమపూజ్యులునునగు మ రా రా శ్రీ రావుసాహేబు, వేపకొమ్మజి సుబ్బయ్యపంతులుగారి ఔదార్యముచేతను "విస్మృతకళింగాంధ్రకవులు" అనుపేర నీగ్రంథమును నాంధ్రలోకమునకు సమర్పించుచున్నాఁడను

విజయనగరము,
1-6-1940

ఇట్లు,
అడిదము రామారావు

# విషయసూచిక.

# విస్మృతకళింగాంధ్రకవులు.

## శ్రీ పూసపాటి తమ్మభూపాలుఁడు

(క్రీ శ 1620—1700 సం॥)

శ్రీపూసపాటి తమ్మభూపాలుఁడు (ఉరఫ తమ్మిరాజు) "సరస్వతీసాక్షాత్కారమును బొంది, తాను తన ప్రభావముచే వారి రాజ్యమున నేఁబదియేండ్లకాలము సువర్ణవృష్టి గురిపించె" నని ప్రసిద్ధిగన్న మాధవవర్మసంతతివాఁడు. ఈమాధవవర్మసంతతిలోనివాఁడును, 15వ శతాబ్దిక కడపటిభాగమున దక్షిణహిందూస్థానములో రాజ్యముచేసిన ప్రౌఢదేవరాయలకు సమకాలికుఁడును నగు శ్రీ పూసపాటి రాచిరాజునకు నైదవపురుషుఁడగు గోపాలకృష్ణమహారాజు తమ్మభూపాలునిజనకుఁడు; తల్లి జగ్గమాంబ. ఈయిరువురినిఁగూర్చియు నీకవి తన కృష్ణవిజయములోఁ గృత్యాదిని నిట్లు ప్రశంసించియున్నాఁడు.

సీ. సుకవినుతులైన యారాజసుతులలోన
నతికుశలుండగు గోపాలనృపునిసుతుఁడు
…త్రివహించె గోపాలకృష్ణరాయ
విభుఁడు మజ్జనకుండు దోర్విజయశాలి

సీ. నిత్యపాతివ్రత్య నియమంబునకు ఠావు
సత్యవాక్యమునకు జన్మభూమి
దీనరక్షణదయాదృష్టి కాధారంబు
భాగ్యలక్షణముల పట్టుకొమ్మ
వినయవర్తనముల విహరణస్థాన మ
త్యౌదార్యమునకు నేకాశ్రయంబు
నిరుపమానక్షమానియతికి శరణంబు
దాక్షిణ్యమునకు నాస్థానజగతి
యనుచు సుజనులు వర్ణింప నలరుఁ గరి
కృతివినుతుఁడైన గోపాలకృష్ణరాయ
వసుమతీనాథుసతి భాగ్యవతి మదంబ
సకలసుగుణకదంబ శ్రీజగ్గమాంబ

ఈకవి తన రాజ్యమునుగూర్చిగాని రాజధానినిగూర్చిగాని తన గ్రంథమం దెచ్చటను స్పష్టముగ వివరించియుండలేదు, కాని గ్రంథమునందు వేసికొనిన గద్యములోని "మాధవవర్మ వంశాలంకార, శ్రీమన్మహామండలేశ్వర మహీమండలరాయ, మన్నెసులతాను" మున్నగు విశేషణములంబట్టి యితఁ డొక గొప్ప మండలాధిపతిగఁ గన్పింపవచ్చును, గాని యవి వంశపారంపర్యముగా వచ్చుచున్న బిరుదములై యుండవచ్చునని తోఁచెడిని. ఇంతియగాక కృత్యాదియం దితఁడు తన్నుఁగూర్చి సభ్యులన్న పలుకులుగఁ జెప్పిన—

సీ. అనిమేషవృత్తిఁ జూచుకొనువారి నిరసించి
యనిమేషవృత్తిఁ జూచుకొనెడివారు
కౌశికసఖ్యంబు గాదని సరకుంచి
కౌశికసఖ్యంబుఁ గాంచువారు
సద్యోవిమానులై చనుట హేయంబని
సద్యోవిమానులై చనెడివారు
జీమూతమార్గంబుఁ జెందుట తగదని
జీమూతమార్గంబుఁ జెందువారు
నగుదురు రణాగ్రభూమి నియహితనృపులు
గదిసి భేరీమహారవాకర్ణనమునఁ
జిత్తమును మెత్తనై భ్రాంతిఁ జెందరేమొ?
ప్రకట భుజశౌర్య తమ్మభూపాలవర్య

మున్నగు పద్యము లాతని విక్రమప్రాభవాతిశయములను స్థిరపఱుచుచున్నను జరిత్రములం దీతఁ డొక సామాన్యరాజుగా చెప్పఁబడియున్నాఁడు విశాఖపట్టణపు "డిస్ట్రిక్టుమాన్యూల్" నందు సంగ్రహింపఁబడిన సమాచారమునుబట్టి చూడఁగా 1652 సంవత్సరప్రాంతమున నీతమ్మభూపాలుఁ డుత్తరసర్కారులకు వచ్చినట్లును, నాకాలమున శ్రీకాకుళములో "ఫౌజుదారుగా నుండిన షేరుమహమ్మద ఖాను నొద్దనుండి కుమిలి, భోగాపురములను నిజారాకుఁ బుచ్చుకొని మహమ్మదియప్రభుత్వమునకు లోఁబడి యొక చిన్నరాజై యుండినట్లును గనఁబడుచున్నది

ఉండినట్లు వ్రాసి "డిస్ట్రిక్టుమాన్యువలులో" నిట్లున్నది — "పూసపాటి [illegible] మాధవవర్మగారు [?] అప్పుడు శ్రీకాకుళం సర్కారులో నొకభాగముగా నుండు విశాఖపట్టణముజిల్లాలోనికి వచ్చిరి 1652 సంవత్సరములో ననఁగా రారాజగు నౌరంగజేబు చేతివలన గోలకొండరాజవంశము నశింపుచేయఁబడక పూర్వము 35 సంవత్సరములకు ముందట వారచట వచ్చుట జరిగినది అప్పటిలో షేరుమహమ్మదుఖాను శ్రీకాకుళములో ఫౌజుదారుగానుండెను ఆతనివద్ద మాధవవర్మగారు కుమిలె, భోగాపురములను జాగీరా చేసిరి (కార్మైకల్ దొరవారి యింగ్లీషుగ్రంథమునకు పిఠాపురపు వేంకటకోదండరావు పంతులుగారి తెనుఁగుతర్జుమా 201 వ పుట)

కార్మైకెల్ దొరవారిచె వ్రాయఁబడిన మీఁదిసమాచారమునకుఁ బ్రమాణమేమియో వారు చూపరైరి క్రీ॥ శ 1652 సంవత్సర ప్రాంతమున శ్రీకాకుళం సర్కారునకు షేరుమహమ్మదుఖానుఁడు ఫౌజదారుగానుండినట్టు *"డిస్ట్రిక్టుగజటియరు"నందుఁ జూడఁగన బడుచున్నది కుమిలె భోగాపురముల రెండింటిని షేరుమహమ్మదు తమ్మభూపాలున కిచ్చినట్టు "మ్యాన్యూల్"

---

* Two of these chiefs were the ancestors of the present Maharaja of Bobbili and Raja of Vizianagaram who entered the district in the train of Sher Mahammad Khan (name father of Sher Mahammad Puram near Chicacole) who was Foujdar in 1652 (Gazetteer of the Vizagpatam District—Page 30)

చెప్పుచున్నది, గాని యంతకుము న్నీకుమిలె స్థానికుల పూసపాటివారియథనకు లో (The Local Pusapaties) నున్నట్టుగఁ గొన్నియాధారములు గానఁబడుచున్నవి విజయనగరమునకు సమీపముననున్న వేంకటరాజపుర మను నామాంతరముగల కొర్లాంఅగ్రహారమును బ్రాహ్మణులకు దానముగానిచ్చిన ఉపాధ్యాయకర్తలగు శ్రీ పూసపాటి వెంకటపతిరా-మహారాజులుంగారు వారిగ్రంథమునం దితమ్మభూపాలునిఁ గూర్చి ప్రశంసించియున్నారు, గాని యాతనిరాజ్యమునుగూర్చి గాని, నివసించియుండిన పట్టణమునుగూర్చిగాని యేమియు వివరించియుండలేదు ఈమీఁదికారణముల చేత 'డిస్ట్రిక్టు మ్యాన్యూయల్' లో నీయఁబడిన వృత్తాంత మెంతవఱకు విశ్వాసార్హమో బాగుగఁ బరిశీలింపవలసియున్నది అట్టిపరిశోధనగావించి యందలి యథార్థముఁ గనుఁగొనువఱకును దమ్మభూపాలునికాలము పదునేడవశతాబ్ద్యుత్తరభాగమనుటయే సమంజసమని తోఁచెదను

ప్రౌఢదేవరాయలకు సమకాలికుఁడగు పూసపాటి రాచిరాజీ తమ్మభూపాలునకు నాలుగుతరములు క్రిందటివాఁడు తరమునకు 30 సంవత్సరములు చొప్పున లెక్కించిచూచినయెడల నీ కవికాలము 17 వ శతాబ్దముయొక్క యుత్తరభాగమునకు సరిపోవుచున్నది

ఇంతియెగాక, కొర్లాంఅగ్రహారపు దానశాసనముయొక్క కాలము క్రీ శ 1715 ఇదియే మొదటియానందరాజుగారి

రాజ్యకాలము కొర్లాం అగ్రహారమును దానముచేసిన వేంకట పతిరాజుగారును, సీయానందరాజుగారును సోదరులు వీరికి నడుమ దిమ్మిరాజుగారి (Alias తమ్మ భూపాలుఁడు) తమ్ముని కుమారుఁడు సీతారామరాజుగారు పదునేను సంవత్సరములు మాత్రము రాజ్యము చేసిరి దీనినిబట్టి చూచినను దిమ్మభూపాలునికాలము 17 వ శతాబ్ది వివరభాగముగనే కనఁబడుచున్నది

కృష్ణవిజయము కృత్యాదిపద్యములయందు నీయఁబడిన కృష్ణానదీవర్ణనము, విజయవాటికాపురవర్ణనము మున్నగువాటిని బట్టిమాత్రము గవి యీ కృతిని 1652 వ సంవత్సరమునకుఁ బూర్వమే వ్రాసియుండవలయునని తోఁచెడి

## గ్రంథకర్తృత్వమునుగూర్చి చర్చ

ఈకృష్ణవిజయకర్తృత్వమునుగూర్చి వివాదముకూడఁగలదు అచలాత్మజాపరిణయము బృహన్నాయకీయము మొదలగు గ్రంథములను రచించిన కొటికలపూడి కవి దనాపకులోనై దీనిని దమ్మభూపాలునిపేర రచించెనని కొందరియభిప్రాయము అట్టి యభిప్రాయము స్థిరపడుటకు వలెననియో మరి యేకారణముననో "అచలాత్మజాపరిణయము"నకుఁ బీఠిక వ్రాసినవారెవరో శ్రీకృష్ణవిజయమును విజయనగరమహారాజుగారికిని, దరాత్మజాపరిణయమును అల్లూరి అప్పలరాజునకును, పట్టభద్ర...

* ఈకవి డెనుజ రఁగనీరు ద్రాక్షరశాలలో ముద్రితము

చరిత్రమును మల్లారెడ్డికవి ఈమృత్యుంజయకవిరచియించియిచ్చి ష్టముగా వ్రాయుచునేకాని, యట్టి తమవ్రాఁతకుఁ బ్రమాణమేమో యందుఁజూపరైరి ఇట్టిసమాచారము రాజకవులకృతులతో సంబంధించియుండుట మనకు వింతకాదు ఆముక్తమాల్యదను రచించిన కృష్ణదేవరాయలంత మహనీయునకుఁగూడ నిట్టివాదుకలిగియున్నదిగదా! రాయలు విద్యాధికుఁడని ప్రసిద్ధియుండియు, మనుచరిత్రాముక్తమాల్యదలకు శైలి మొదలగువానియందు భేదము కనఁబడుచున్నను "ఆముక్తమాల్యద" కర్తృత్వము పెద్దనార్యునకే యారోపించుచు, లక్షణగ్రంథములు వ్రాసిన మనపూర్వకవులు కొందఱు లక్ష్యములఁజూపుపట్లను 'పెద్దన్నగారి యాముక్తమాల్యద'యని వ్రాసియుండలేదా! కాని గ్రంథము బాగుగఁబరిశీలించి చూచినప్పుడును, యుద్ధాదివర్ణనలఁబట్టిచూచినచో నితఁడు క్షత్రియుఁడైయుండవలయునని తోఁచకమానదు అంతియగాక శ్రీవీరేశలింగంపంతులుగారు తమయాంధ్రకవుల చరిత్రమునందు మూఁడవభాగమున నాధునికకవులలో నీమృత్యుంజయునిఁ జేర్చియున్నారు ఇతఁడు నూరు సంవత్సరములక్రిందటికాలమున నున్నవాఁడనియు గోదావరిమండలములోని 'గోకి'యను గ్రామమున నితని మునిమనుమలిప్పటికి జీవించియున్నారనియు వ్రాసియున్నారు అందుచే 18 వ శతాబ్దములో జీవించియున్న మృత్యుంజయుని 17 శతాబ్దమధ్యభాగమున రచింపఁబడిన కృష్ణవిజయముతో సంబంధము

కలిగియుండుట యసంభవము ఇంకను ఈ పూసపాటివంశము నందలిరాజులు కొందఱు కవులై యుండుట యనుశ్రుతముగా వచ్చుచున్నది తమ్మభూపాలునకుఁ బూర్వ మొకరిద్దఱుకవు లున్నట్టుగ విదితము తరువాతివారిలో వేంకటపతి మహారాజులుంగారు 'ఉషాభ్యుదయమును,' కే సులవలసపూసపాటికుటుం బములోని విజయరామరాజగారు "విష్ణుభక్తసుధాకరమును" 'హారాలక్షణము"ను, రచించియున్నారు అంతేకాక వంశ మందలిరాజు లందఱును విద్యాధికులు కవిపోషకులు పద్మనా భయుద్ధమునందువీరస్వర్గమునుగాంచిన శ్రీచినవిజయరామమహా రాజులుంగారు సంస్కృతాంధ్రములయందుఁ గవిత్వముచెప్ప సామర్థ్యముకలవారని మనకు లభ్యములైయున్న శ్లోకములవ నను బద్యములవలనను దెలియుచున్నది ఆప్రభువరునిదని వాడుక లోనున్న యొకసంస్కృతశ్లోకమిందుఁ గొందుపరుపఁబడుచున్నది

శ్లో॥ అంభోజంకలయన్ సదృక్షమవనే సాహిత్యరీత్యాంధృశో
మాంధాతార మపారసంపది మహాభావే యశోరాశిషు
శత్రూణాం పురభంజనే ధృతిగుణే కించోరగేంద్రంమతి
ప్రాగల్భ్యేప్రతిభాతి తిమ్మనృపతి పాకాహితప్రాభవ

ఆకారణముచేత చిక్కృష్ణవిజయముకర్తృత్వము తగినన్ని ప్రబలనిదర్శనములఁజూపక మార్చివేయుట న్యాయ్యముకాదు ప్రాభవమున్నచోట విద్య యుండఁగూడదా? రెండును నొక్క చోట నిలిచియుండుట యరుదైనను గావచ్చును

## గ్రంథప్రశంస

ఈ కృష్ణవిజయ మైదాశ్వాసముల ప్రబంధము దీనిని వ్రాయుటకుఁ దన సామాజికుల ప్రోత్సాహమే కారణమని కవి యిట్లు చెప్పియున్నాఁడు

ఉ. సంశయమేల యిచ్చటను సర్వగుణాఢ్యులనైనయట్టి యం
చెంచెను మానవుల్ పుత్రివాతురుగావున నందు విప్రదే
వాంశముఁబెంపుఁజెందించి చతుర్థులఁదేసిన వారివెల్లఁ ది
గ్మాంశుకులావతంస! సమరార్జున! యిమ్ముఁ దినైజగా!

వ. హరివిలాసావతారములయందు ప్రశస్తము కృష్ణమూర్తియ
క్రూరిపు కంసశోకములఁ గావ సురేంద్రుఁడు విన్నవింపఁగా
నందకునిసంహారంబి నలనామమునం బదియూరునేల మున్
బాణమునైనయక్కథఁ బ్రబంధముగా నొనరింప గాదగున్

కం. అను సభ్యుల వాక్యంబులు
విని నామదిలోనితలఁపు విబుధులవచనం
బును నొక్కటయ్యె నగునని
యను మోదాపూర్ణాంతరాత్ముఁడ నగుమున్

ఇందుఁ బ్రథమాశ్వాసమునఁ గృత్యాదిపద్యములును, కృతికర్తవంశావళియును శ్రీకృష్ణునిపురమగు ద్వారకాపురము వర్ణనమును శ్రీకృష్ణునివర్ణనమును గలవు

## పురవర్ణనము

వ. బలరిపుపన్నగాధిపుల పట్టణముల్ దమలోన హెచ్చుగుం
దులకయిపోరఁగా నది గనుంగొని మాన్పఁదదంతరంబునన్
నిలిపె విరించి యప్పురము నిశ్చయమిట్టిదెకాకయున్న గో
సలలితహార్ద్రక్షేమజలసంతతి రెంటని నంటనేటికిన్

ద్వితీయాశ్వాసమున వినోదము గానున్న నాయకుల యొక్క సమరక్రియానుకూలమగు శరత్కాలవర్ణనము, నాయకునియందుఁ గాలోచితమైన భావపరిణామము, దేవలోకమందు నరకుని దర్శయములును వానిబారినుండిఁ దమ్ము రక్షింపఁ గృష్ణుని వేడుటకు దేవేంద్రుఁడు వచ్చుటయు, శ్రీకృష్ణదేవేంద్రుల పరస్పరమర్యాదలును, నింద్రుఁడు నరకుని యుద్రేకముల నుగ్గడించి చెప్పి యతని సంహారమునకై శ్రీకృష్ణుని గోరుటయు శ్రీకృష్ణుని నిశ్చయమును, వైనతేయుని రాకయును, సత్యభామ కృష్ణునితో వచ్చుటకు నాతని వేఁడుకొనుటయు, నంతలకు శ్రీకృష్ణుని యాగకారమును, సత్యభామాశ్రీకృష్ణుల ప్రయాణము నందు మార్గమునం గలి విచిత్రములను శ్రీకృష్ణుఁడు సత్యకు నిరూపించి చెప్పుటయు, పిదప, నరకునిపట్టణము [illegible] పుట్టుక, నాటి ప్రసంగము మున్నగు వి[illegible]భివర్ణింపఁబడి నవి

## శరద్వర్ణనము

సీ. పరులు ప్ర[illegible], [illegible]క రుతహేల లణంగ, [illegible]కాంతి[illegible]
కేకుహాముల్ చెలంగ, రణకేళికి శూరులుపొంగ మేఘ సం
చారముబ్రుంగఁ, గోపలు నాంతి యొరుంగ, వియోగిచిత్తము లో
సారెఁగరంగ, రంగలరు శారద వేళగడంగె - తెజిన్

జటులతరచక్రధారా
త్రుటితశిరస్కములఁ జేయు తోయజనాభా !

ఈసందర్భమున నుత్తరహరివంశమునందుఁ గాని, శ్రీమ ద్భాగవతమునఁగాని సత్యభామా శ్రీకృష్ణుల సంభాషణలు బెంచి వ్రాయఁబడియుండలేదు ఈగ్రంథమున మాత్రము పయినైదు పద్యములకుఁ దక్కువగాకుండగ నీసంభాషణము విపులముగను జమత్కారముగను రసోచితముగను వ్రాయఁబడి యున్నది ఉదాహరణమునకుఁగా నొకటి రెండు పద్యము లిచ్చటఁజూపఁ బడినవి

మ చపలాలోకములుంబయోధరవిలాసంబున్ రసోత్కర్షమున్
విపులానందము మీఱఁగా నెరపి ప్రావృట్కాలపున్ లీల వే
రుపడం జేసి మదీయయాత్రకును సంరోధంబు గావించెదో
యిపుడీరాకకు నేమికారణము తన్వీ? నేఁ బాయింపుమా !

సీ చిలుకపల్కులుగావు చెలిమితో విననీకు
సమదభేరాట్టహాసములుగాని
చెలులభూములుగావు చేరికగాననీకు
నమరారివికృతవేషములుగాని
గృహదీర్ఘికలుగావు క్రీడసేయఁగనీకుఁ
బ్రకటరక్తస్రవంతికలుగాని
విరులవేటులుగావు వేగడాయఁగనీకుఁ
గరినబాణప్రయోగములుగాని

చారుసరభసలీల సంచారవన వి
హారములుగావు వేడ్క సేయంగనీకు
భయజనక హాసాహావక్రియలుగాని
జెంతనమేల నీకింత నీలవేణి ?

— ఈసందర్భమునందే భాగవతమున నిట్లున్నది —

సీ. సమదపుష్పంధయ ఝుంకారములుగావు
భీషణకుంభీంద్ర బృంహితములు
వాయు నిర్గతపద్మవన రేణువులుగావు
తురగరింఖాముఖోద్ధూతరజము
లాకీర్ణ జలతరంగా పారములుగావు
శత్రుధనుర్ముక్తసాయకములు
కలహంసనారసకాసారములుగావు
దనుజేంద్ర సైన్యకదంబకములు
కమలకల్హారకుసుమసంఘములుగావు
దుముల రిపుశూల ఖడ్గాది సాధనములు
కన్య విచ్చేయ, రణరంగ గమనమేల,
వత్తు కేగము నిలువుము వలదు వలదు

తృతీయాశ్వాసమున శ్రీకృష్ణునిపాంచజన్యముచే బుర
మునందలి యోధులు యుద్ధసన్నద్ధులగుట, మురాసురుని యుద్ధ
ము, నరకుడు శ్రీకృష్ణుని నెదిరించుట, సత్యభామ యుద్ధము
నకు సిద్ధమగుట, నరకునియదలింపు, శ్రీకృష్ణుని ప్రత్యుత్తరము

శ్రీకృష్ణుని విజయము, భూదేవి ప్రత్యక్షమై పౌత్రునిచే ప్రమో క్షించి శ్రీకృష్ణునభయము వేడుకొనుట, శ్రీకృష్ణభగవానుఁడు ప్రసన్నుఁడగుట, భూదేవి వర్ణనము మొదలగునవి యభివర్ణింపఁ బడినవి

## సత్యభామయుద్ధము

సీ. సకలసాధ్వీమణి సహజసౌశీల్య ధ
 ర్మముపూని నట్ల ధర్మంబుపూనెఁ
దారకాభస్థూలతర మౌక్తికములందు
 గుణముగూర్చిన యట్ల గుణముగూర్చెఁ
దరిఁజేరుచున్న రత్నములందు కొనఁగాంచ
 శరధిఁజూచిన యట్ల శరధిఁజూచె
జలకేళిఁజాల మత్సరముతోఁ జెలిమీఁద
 శరములేసిన యట్ల శరములేసె
వింతపనియన్న చింత యొావంతలేక
తనకు నభ్యస్తమైన చైదంబుగతినె
సముదితాశ్చర్య సంభ్రమదమరమైన
సమరమొనరింపఁజొచ్చె నాచంద్రవదన ఆ 3-8

సీ. నవమందహాస కందళలీల హరిచోట
 నరిచోట నట్టహాసాంకురంబు
అమృతంబుఁ జిల్కు నెయ్యఁపుఁబల్కు హరిచాయ
 నరిచాయఁ గోపనిష్ఠురతరోక్తి

ఎఱతూపు హూపు బిత్తరమూపు వారిచెంత
నరిచెంత శిఖిశిఖాభరనిరీక్ష
ఱుల విశ్వల్లల సమవృత్తి వారిపజ్జ
నరిపజ్జ నగుంలానువృత్తి
నెలయ శృంగారరసమును వీరరసము
నిరుపెసలయింప వెడఁజల్లు నిరుపురుఁబోఁడి
శ్రోణిమి తెలుంగుఁ గాంచి గీర్వాణలీల
వేణులాశ్చర్యరసధుర్యవాణులైరి ఆ 3-92

ఈసందర్భమున నాచనసోముని యుత్తరహరివంశమున నిట్లున్నది

మ. ఉరిఁజూపెన్ వాఁజూచుకము లందందందమందారకే
సరమాలామకరందధుర్మసలిల స్యందంబు లందంబులై
తొరఁగన్ బమ్మెదకొంగొంకంతదాల గన్ దోస్తోత్రరాసారమున్
దరహాసామృతపూరముం గురియుచున్ దన్వంగి కేళీగతిన్

ఉ. ఊఁచినకత్తి వంచని పయోరుహాలోచన మింటమంటలన్
బూఁచిన బాణజాలమునఁ బూర్వసుపర్వపురాణగర్వమున్
వేఁచిన చందమున్ విపుల విరసంబున నాత్మచిత్తముం
దోఁచి విహారిదముం జెలియుఁ దోఁచిన నవ్వు లిచ్చి మెచ్చిరే

ఈసందర్భమున శ్రీమద్భాగవతమున —

మ. పరుఁజూపున్ ఎరుఁజూచుపొంపనలరింపన్ రోషరాగోదయా
విరతభ్రూకుటి మందహాసములతో వీరంబు శృంగారమున్

జరుఁ గన్నులఁ గెంపుసొంపుపరఁగం జండాస్త్రసంతాప మున్
సరగా గోకి మూహాము న్ వెరపుమన్ జంద్రాస్య హేలాతిన్

శా. అగ్గింపాలకి యూఁచ కొప్పెసఁగఁ బ్రత్యాలీఢపాదంబుతో
జలజ స్వేద కణార్ణ జాలకలతో నాకర్ణికానీత స
ల్లలితజ్యాముఖపుంఖ దీధితులతో లక్ష్యావలోకంబుతో
వలమారారి ధనుర్ధ్వము త్రివిశిఖ వ్రాతాహతారాతియై

ఈ కృష్ణవిజయమును" భాగవతముతోను హరివంశముతోను సరిపోల్చి చూచినచో కవి భాగవతమునే చాల వఱకు ననుసరించినట్లు గను, నందలికథ తన గ్రంథమునకు ముఖ్యాధారముగా నుంచుకొనినట్లు మనకుఁ దెలియఁగలదు.

ఇంతవఱకు జరిగిన కథతోనే గ్రంథము పూర్తి కావలసి యుండును గాని, కవి యీసందర్భము ననుసరించి నరకాసుర విజయమును గూడ నిందుఁ జేర్చియున్నాఁడు. అయ్యది పారిజాతాపహరణకథ. భగవంతుఁడగు శ్రీకృష్ణుఁడు దేవతలు తన యందుఁ జూపిన కృతఘ్నతను సహింపక వారి నవితరీతి శిక్షించెనని యిందు స్పష్టపఱుపఁబడియున్నది. పారిజాతాపహరణము నందలి నారదప్రవేశమును, సవతులకయ్యమును శ్రీకృష్ణుని సత్యభామ తన్నుటయు మొదలగునవి పూర్తిగ విసర్జింపఁబడినవి.

ఇందలి చతుర్థాశ్వాసమున శ్రీకృష్ణభగవానుఁడు నరకుని కుమారుఁడగు చేయు నాతిథ్యమును బొందుటకై పురిలోనికిఁ జని

డారినగరేందిరామ హాోదారవార
కాంచి యిదికాంచితే యభ్రగంగయబల!

చ అల జలజోద్భవుండ నిలజాదులఁ గెల్వఁగలేని చిత్తజం
దెలియఁగ గాంచి తజ్జయము దిగ్గనవానికి నీఁ దలంచి యీ
నలినశరంబులన్నియుఁ గనత్కనకంబునఁ జేసెఁ జూచితే
వలయుఁ గదాజగంబుల సువర్ణుల గెల్వ సువర్ణ కాంతము ల్

## శచీసత్యభామల యన్యోన్యమర్యాదలు

ఉ అంతట సత్యభామ వినయంబమరంగ సుపర్వదూతికా
సంతతివచ్చి తోకొనుచుఁ జయ్యన నేగఁ దదీయమైన శు
ద్ధాంతగృహంబుఁజొచ్చి యమరాధిపునమ్మకు నర్మిలిన్ శచ
కాంతకు మ్రొక్కె వారుఁదనుఁగ గిటఁజేర్చిబహూకరించుచున్

పంచమాశ్వాసమున వసంతాగమము, శృంగారరసోద్దే
కము, పారిజాతాపహరణము, దేవేంద్రనిపై శ్రీకృష్ణునివిజయ
ము, ద్వారకాపురాభిగమనము, దేవకన్యకలవివాహము, పెద్దల
యనుమతిని శ్రీకృష్ణుఁడు వారినందఱను వివాహమాడుట, కల్యా
ణమహోత్సవము, వనవిహారము, పుష్పాపచయము మొదలగు
నవి వర్ణింపఁబడినవి పారిజాతమును బెంచుట శ్రీకృష్ణుని
విలాసముగనే యిందుఁ గవి వర్ణించెనుగాని సత్యభామకు దానిఁ
తోఁ బ్రసక్తియున్నట్లు వ్రాయలేదు

గీ. అమితనిజదాన మహిమతో సమతఁ గాంతు
నంచు గర్వించు నదియన్నయలుకఁ బోలెఁ
గృష్ణుఁడవ్వేళఁ దనవు కేలలిలఁ
బట్టి పెకలించె నాదివ్యపాదపంబు 5 ఆశ్వా

చ. వనితయొకర్తు కృష్ణుఁ గనువాంఛ మదిం బెనఁగంగ నెగిత
త్కనకగవాక్షపంక్తి నెడఁ గానక నొక్కలతాంగ మూఁపుపై
ననువుగ నెక్కి చూచె నది యాభర మోపియుఁ గానదయ్యె నా
ఘను నెడలగ్నమై మనసు గ్రమ్మరవచ్చుట లేకయుండగన్

సీ. వకుళాగమాశోకముకుళాగ్రగానేక
సకులాంగనానీక చంచరీక
మమితానవాసార సుమితాగ్ర్యసహకార
దమితార్యమనివార ధైర్యసార
మసమాన విటపాంతిలసమాన సుమసంత
తిసమానతానంతతిలకవంత
మటనానలసమీరపటు నాయితవిహా
ఘటనాదికోదా రకర్బ్రికార

గీ. మదయమృపియజశిఖిసముదాయవిగత
దళితవిచలితనిజమతి కలితవిరహి
కలుషలలితమృదునవపవచటులశుకపి
కాసనముఁగాంచి నొక కేళికాననంబు

సీ. శ్రుతిపారగత పురోహితనినాదితమంత్ర
మధురారవములన్ని మందిరముల
సరసవారాంగనాసందోహ కల్యాణ
గీతంబులన్ని నికేతనముల
పణవడిండిమశంఖపటహాదివాద్యని
నాదంబులన్ని గేహాంతరముల
గాఢసమ్మదయుతబ్రాహ్మణవందిస్తోత్ర
కోలాహలములన్ని యాలయముల

గీ. హెచ్చుచెలఁగ గానసొల్ పెచ్చు ధరణి
విభులసందడు లన్నినివేశములను
వెలుఁగ కన్యకలన్నిఁ గౌతుకమున
నన్నిమూర్తుల హరి పెండ్లియాడెనపుడు

ఈ రీతి సీసముల రెంటిని మిగులమనోహరముగా సమ్మేళనము చేసి యీతమ్మభూపాలుఁడు తనకల్పనాకౌశలమును జూపియున్నాఁడు. ఇంతవఱకు నీయఁబడిన పద్యములనుబట్టి కవికిఁగల నిరుపమానసాహితీపటిమయుఁ గల్పనాకౌశలమును దేటపడఁగలవు. కవికి సంస్కృతాంధ్రములయందుఁ జక్కనిపాండిత్యము కలదు. పదియవయాశ్వాసమునందు దండకమునఁ జేయఁబడిన సర్గస్తవము కవికిఁగల సంస్కృతసాహిత్యమును వెల్లడిచేయుచున్నది. కాళిదాసమహాకవి శ్యామలాదండకము ననుకరించు నుద్దేశముతో దానిచాయనే యీదండకము నీతఁడు జెప్పియు

# పెనుమళ్ల సోమనామాత్యుఁడు

(క్రీ శ 1620—1700 సం॥)

ఈతఁడాఱువేల నియోగి బ్రాహ్మణుఁడు భారద్వాజ గోత్రుఁడు సోమమంత్రి పౌత్రుఁడు సుప్రసిద్ధాంధ్రకవిశేఖరుఁడగు పిల్లలమఱ్ఱి పినవీరభద్రునికి మునిమనుమఁడు (7 వ తరము వాఁడు) వీరభద్రుని రెండవకుమారుఁడగు మల్లేశ్వరుఁడు కటక పురాధీశ్వరుఁడగు గజపతివలన "పెనుమళ్ల" యను నగ్రహారమును బడసినపిదప పిల్లలమఱ్ఱివారు పెనుమళ్లవారైరి ఈ విషయము సోమనకవి తన కృతియగు 'సీమంతినీకల్యాణము' కృత్యాది నిట్లు తెలిపియున్నాఁడు

సీ

మహనీయతేజుఁడౌ మల్లేశ్వరుండంతఁ
గజపతి కార్యదక్షతా మనతఁ జూచి
మెచ్చి యాకటకేంద్రుఁ డిచ్చిన పెనుమళ్ల
యన్న గ్రామమునందు నధివసించె
నాటనుండి తదీయ నామంబుచేత న
న్వయము ప్రకాశంబుఁ గాంచుచుండె

మల్లేశ్వరుని నాఁటినుండియుఁ బిల్లలమఱ్ఱివారగు నీపెనుమళ్లవారు కళింగదేశమునందే నివసించుచు వచ్చిరి ఈవంశము

వంశ మంత్రిపుంగవులు వెలసి వంశవిఖ్యాతిని నిలుపఁగలిగిరి ఈవ్యాసమునకు విషయమగు సోమనమంత్రి శ్రీవిజయనగర ప్రభువులగు శ్రీపూసపాటివారియొద్దను సేతని పెదతండ్రి బసవ మంత్రి నందాపురాధీశులకడను (ఇప్పటి జయపురాధీశులే ప్రాచీనకాలపు నందాపురాధీశులు) మంత్రులుగా నుండిరి సోమమంత్రి శ్రీపూసపాటి తమ్మభూపాలమహారాజునకు మంత్రి గానున్న విషయము గ్రంథముచం దిట్లు చెప్పఁబడినది

సీ. వాటికా పురాశ్రియమైన దుర్గాంబ
కృపఁగాంచె నే నృపాగ్రేసరుండు
మాధవవర్మ కుమారవారాశి వంశ సూ
షణుం డయ్యె నే భూభుజుండు
కిరినారిహృదయ శరమన్న సులతాను
చే ంబు ఫ్రాపె నె నరవరుండు
సకల యాచకుల యాశాపూర్తి యొనరించు
శివాస శూరుఁ డే యవనినేత

గీ. ఏనవర్తిల్లె నా యాపూసపాటి
తమ్మభూపాలకుని సముఖమ్మునందు
మంత్రివై తద్దయా సుదామయాక రక్ష
మహిమగాంచితివయ్య! సోమప్రధాని

షేరుమహమ్మదుఖానుఁడు (క్రీ శ 1652-84) శ్రీకా కుళము సర్కారునకు "ఫౌజుదారు"గా నున్నయపుడే మాధవ

వర్మబిరుదాంచితుఁడు శ్రీపూసపాటి తమ్మభూపాలుఁడు కుమిలి భోగాపురములను 'ఇజారా' కుఁదపెకొని విజయనగరరాజ్యమునకు శంకుస్థాపన జేసినట్లుగా 'విశాఖపట్టణపు 'డిస్ట్రిక్టుమాన్యుయల్' మొదలగు చరిత్రలవలనఁ దెలియవచ్చెడిని. ఈవి కుటుంబముగ నుండె. గురజాడ శ్రీరామమూర్తిపంతులువారు తమ్మభూపాలకృతిమగు కృష్ణవిజయము నుపోద్ఘాతములోఁ గవికాలము 1650 సం॥ర ప్రాంతమని తెలిపియున్నారు కాఁబట్టి యీ రాజపుంగవుని మంత్రియగు సోమనామాత్యుఁడుఁ గూడఁ బదునేడవశతాబ్ద్యుత్తరభాగమువాఁడని చెప్పుట కభ్యంతరము లేదు.

కళాకోవిదుఁడైన యీ సోమమంత్రి, కవితయం దమితమోదముఁ జూపెనేగాని జీవయాత్రకు దానిని సాధనముగాఁ జేకొన్నవాఁడుగాఁడు రాజ్యకార్యనిర్వహణముతోఁ బాటు కవితాకళాలాలసత్వము చూపి యీతఁడు కవిబ్రహ్మయను బిరుదమును బొలియున్నాఁడు సోమమంత్రి నాదరించిన తమ్మభూపాలుఁడు రాజగుటయేగాక కవిరాజుఁగూడనై 'కృష్ణవిజయమను' నా శృంగారరసప్రబంధమును రచించి మించెను సోమమంత్రి కృత "సీమంతినికల్యాణము' నకును 'కృష్ణవిజయము' నకునుఁ గృత్యాదినిర్మాణమునందుఁ గొంత సాదృశ్యము మాపట్టుచున్నది బహుశః మంత్రియగు నీకవి తన యేలికకృతి ననుసరించి యుండవచ్చునని నాయూహ. ఈక్రింది పద్యముల రీతులఁ బరిశీలించి చూచిన విశదముగాక

నుండుటచేతనే సోమమంత్రి కవితాప్రాగల్భ్యము కలుఁగఁడుఁ బ్రకాశించెను

ఈకవిప్రవరుఁడు రచించినది సీమంతినికల్యాణము ఇది యొక వ్రతప్రభావమునుఁ దెలుపు గ్రంథము స్థలపురాణము వంటిది ఇందు సోమవార వ్రతప్రభావము నిరూపణచేయఁబడినది ఈపుణ్యకథ పురాణప్రసిద్ధము "స్కాందపురాణంబున బ్రహ్మోత్తరఖండంబునందు విఖ్యాతమైన సీమంతినినామ సీమంతినిమణిచారిత్ర మాంధ్రభాషను రచించి" అని గ్రంథాదినిఁ జెప్పఁబడి యున్నది

శృంగారరసప్రబంధమునకు లక్ష్యముగాఁ గూర్పఁబడిన యీకృతి యైదాశ్వాసములు కలది అందుఁ బ్రథమాశ్వాసము సీమంతినీజననము,యౌవనాదికము మొదలగు విషయవర్ణనలతో ముగియును ద్వితీయాశ్వాసమున సీమంతినియొద్దకు యాజ్ఞ్యవల్క్యునిపత్ని విచ్చేయుట, యామె గావించిన ధర్మోపదేశము సీమంతిని యౌవనప్రాదుర్భావ వర్ణనము, విరహము, చంద్రమలయానిలాద్యుపాలంభాదు లున్నగునవి చెప్పఁబడినవి మూఁడవయాశ్వాసమునఁ గల్యాణయాత్ర, సీమంతినీ చంద్రాంగదులవివాహ మహోత్సవము, లోనుగాఁగలవిషయములు మిగుల విపులముగ సాంకేతికలక్షణములను పాటించి వర్ణనముఁ గావింపఁబడినవి వనవిహారము, జలక్రీడ మున్నగునవి చతుర్థాశ్వాసమున వర్ణితములు ఇఁక పైదవయాశ్వాసమున సత్యమృతసంఘ

టన మొకటి కల్పింపఁబడె, యమునలో విలాసార్థముగ నౌక 'షికారు' చేయుచుఁ జంద్రాంగదుఁడు నదిలో మునిఁగిపోవ నాగకన్యకల సహాయమున నాతఁడు పాతాళలోకమున కేఁగుట సర్పరాజతనిని సమ్మానించుట, నాగరాజు, వరప్రసాదితుఁచే రాకొమరుఁడు మగుడ భూలోకమునకే తెంచుట, తిరుగ హిమం తిని చంద్రాంగదుల సంయోగరూపమగు పరిణయోత్సవము మొదలగునవి మిగులఁ జమత్కారముగ వర్ణింపఁబడినవి

సోమనామాత్యుఁడు కవితాకళయందు తగునేర్పరి. నిరూప్యవిషయమగు శైవభక్తిని బహు సమర్థతతోఁ బ్రశంస గావించి, "శబ్దార్థసంగతచమత్కారంబును బ్రకటిత శివభక్తి పారంబును నగు చాతుర్యకావ్యంబు" రచించెదనని దాను గావించిన ప్రతిజ్ఞను గడు శ్లాఘ్యముగ నిర్వహించెను. కవి పరమశైవుఁడని గ్రంథమునందలి ప్రతిఘట్టమును, స్పష్టముగఁ జెప్పుచున్నది. యాజ్ఞవల్క్యుని పత్ని గావించి ధర్మోపదేశసందర్భమున వ్యక్తపఱచిన రుద్రాక్షవిభూతి, పంచాక్షరీమంత్రప్రభావవర్ణనమును బ్రబలసాక్ష్యము. విచ్చుపోవని వేయేల! యీప్రబంధరత్నము శైవమతావలంబులకుఁ బెన్నిధియనఁ జెప్పుటలో నతిశయోక్తి లేదు. వసంతఋతువర్ణనాసందర్భమునఁ గూడఁ గవి శైవమతావేశమునే చూపి తనభక్తి గరిమను వ్యక్తీకరించినాఁడు.

ఇట్టి సందర్భముల ననుసరించి కవియొక్క మతావేశపరిమాణమును తెస్సగా గ్రహింపవచ్చును సీమంతినీకల్యాణము ప్రబంధకవిలోకులఁ బోటిఁ జాలునట్టి పద్యములకు గనివంటిది ఆకారణముచే మాదిరిపద్యముల నెంచి యుదాహరించుపని బహుకష్టము

అయినను కొన్నిపద్యముల నిందుఁ బొందుపఱచు చున్నాను

మ. సుమనోధర్మముపూని లోకవిజిగీషం గ్రాల పంచేషునిన్
సుమనోధర్మముపూని యప్పరమ మహానుగ్లైల్వఁగానోడి యెం
తమహాశూరుఁడొ యాతఁడప్పగియలంతన్ దీర్చి పోఁజాలె నీ
త్యము దచ్చిత్తములందు ముక్తివనితాన్యాసక్తిఁ గల్గించుచున్

శా. ఆర్యాజన్మనివాస వింధ్యగిరి మధ్యప్రోషిభాగంబునం
దార్యశ్రేణికి నాటపట్టగుట వే సద్వర్తనామంబుతో
నార్యావర్త మనంగ దేశమలరున్ హర్యాది దిక్పాలకై
శ్వర్యశ్రీపరిహాసభాసురగృహాస్థవ్రాత సంకీర్ణమై

ఉ. కోపము వానిసొమ్ము, ఘనుఁ గొంచెముసేయుట వానివిద్య, వి
చూపోపమి వానివృత్తి పరుషోక్తియె వానిగుణంబు, సాధు
సంతాపము వాని సంతసము,దంభము వానికిఁ గన్నతల్లి యా
పాపపు దుర్జనుం దలఁచుపాపము వాయు నుపాయమున్నదే?

గీ. దుర్జనుని కల్మి దురితంపు ద్రోవకగును
సజ్జనునికల్మి పుణ్యంపు సరణికగును

పాము బలసిన గరళంబు ప్రబలమగును
గోవు బలసిన దుగ్ధంబు గురియుచుండు

సీ. చపలతాపత్రయీ సలిలోగ్రసంసార
ఘోరపారావార తారణంబు
సకలజన్మవ్రాత జాతపాతకమహో
ద్ధతకుంభికుంభ విదారణంబు
నంతకానంతకోపారంభ జృంభణ
క్రూరరూప వికారకారణంబు
బహుతరాయాస సంపాద్యమానానేక
ఘనపుణ్యపరిపాక కారణంబు

గీ. మృత్యుజరరాంతరాధ ప్రభూతభేద
జాతవిద్యోతమానజీమూతపటల
విఘటనాపటుచాతుర్యవిస్ఫురత్స
మీరణంబగు రుద్రాక్షధారణంబు

సీ. విస్ఫురసమరేణు విసరకైతవముచేఁ
బసమీఱుభసితలేపన మొసంగి
రసలాలసాయత్త భసలకైతవముచేఁ
బ్రకటరుద్రాక్ష మాలికలొసంగి
కలకంఠకుల కుహూకార కైతవముచే
రమ్యయ శైవమంత్రములొసంగి

యాతతం సంయ వాసితకై తవముచే
  లలితకాషాయ చేలములఁ సంగి
గీ. శైతనాయకదేశిక చక్రవర్తి
వృద్ధతరులకు నతికృపావృద్ధి వెలయ
జగిద యచ్చట్టి యొకవింత చెలువమెన్నఁ
బాశుపతదీక్ష యొసఁగె విభ్రాజితముగ

(సీమంతినికల్యాణము)

ఇంకనొక్క విశేషము - ఇలకొ 18 వ శతాబ్దమధ్యభాగముననున్న అడిదము సూరకవికృతమగు "కవిజనరంజనములోని" పద్యములుకొన్ని, సీమంతినీకల్యాణములోనున్న పద్యములకుఁ బుత్రికలుగానున్నవి పూర్వకవులను తరువాతివారగు కవులు అనుకరించుట సంప్రదాయసిద్ధమగు నాచారమైయున్నను, వీరిఁ దిరెండు గ్రంథముల యందలిపద్యములలోఁ జూపట్టుసాదృశ్యముమాత్రము కొంతవింతగానున్నది ఈషద్భేదముతో సూరకవి పద్యములుకొన్ని సోమమంత్రిపద్యములకు ఛాయాపటములవలెనున్నవి ఇందులకుఁ గారణమిట్లుగా నుండవచ్చునని నాయూహ సూరకవి జనకుఁడు "శుద్ధాంధ్రరామాయణఘటనా వైదుషీధురంధరుఁడు" భాస్కరకవియు, సీమంతినీకల్యాణకృతికర్త, సోమమంత్రియు, సమకాలీనులు, ఏకశాఖీయులు, దగ్గఱచుట్టఱికముగాని దూరపుబాంధవ్యముగాని వీరిరువురకు నుండవచ్చును భాస్కరకవిగూడఁ దమ్మభూపాలుని పోష్యవర్గములోఁ జేరినవాఁడే

ఉ. ఎక్కడఁజూచినన్ గజము లెక్కడఁజూచిన ఘోటకవ్రజం
బెక్కడఁజూచినన్ రథము లెక్కడఁ జూచినఁ గామినీజనం
బెక్కడఁ జూచిన న్గొడుఁగు లెక్కడఁ జూచినఁ గేతనంబులున్
గ్రిక్కిఱిసెన్ బురంబు నువ్వగింజకు రొండెడ సేయకుండఁగన్

(సోమమంత్రి)

సీ. రాజన్యకోటీరరత్నమరీచులఁ
గరదిపికాప్రభల్ గ్రమ్మి మెలఁగ
నాభీలపటుభేరికాభూరిభాంకృతుల్
మత్తేభఘీంకృతుల్ మైత్రిసలుప
నవ్యసుప్రజాశీర్వాదనాదముల్
విమలవందిస్తుతుల్ వియ్యమంద
వారాంగనాదత్త నీరాజనాంశువుల్
హైమవేత్రద్యుతుల్ హత్తుకొనఁగ

గీ. భద్రకరినెక్కి రూపవైభవసమృద్ధి
దర్శనవ్యగ్రపౌరసంతతికినేత్ర
పర్వమొనరించుచును సార్వభౌముఁడపుడు
భూతలాధిపుశుద్ధాంతమునకువచ్చె (సూరకవి)

సీ. పుణ్యాంగనాదత్త భూరినీరాజన
ప్రభలుఁ గుండలమణిప్రభలుఁ గలియ
సౌధాంగనాజనాంజలి కీర్ణసుమరాజి
హారవరమౌక్తికరాజి నలముకొనఁగ

గాయనజనగీతి కాయతనాదంబు
చక్రినాదంబును సంఘటింప
నుర్వీసురోదితాశీర్వాదనాదంబు
హేషితారావంబు నెనయుచుండఁ
గీ. బుష్పితోద్యానవనవీథిఁ బొవునవ్వ
సంతుఁడునుఁ బోలె ధారుణీకాంతతనయుఁ
డపుడు పురరాజవీధి యందఱిగియఱిగి
జనవరేణ్యుని మొగసాల చక్కి నిలిచె

(సోమమంత్రి)

మీఁదిపోలికలఁబట్టి సూరకవికి సోమమంత్రి కవితయం దధికగౌరవముగలదని మన మూహింపవచ్చును ఇంక 17,18 శతాబ్దములలో వెలసిన ప్రబంధరత్నములలో సీమంతినీకల్యాణ మొకమేలిమిరత్నమని నిస్సందేహముగఁ జెప్పవచ్చును

# 4 శ్రీ పూసపాటి వెంకటపతిమహీపాలుఁడు

(క్రీ శ 1660 — 1770 లు)

ఈ రాజకవి శ్రీ పూసపాటిమహారాజవంశమునకుఁ జెందినవాఁడు క్రీ శ ౧౭౧౨ సంవత్సరమున నిప్పటి విజయనగర పట్టణము నిర్మింపఁబడకమున్ను శ్రీ పూసపాటి మహారాజులు కుంభిళాపురరాజ్యమునకుఁ బరిపాలకులుగా నుండిరి. వారు ఇప్పుడు విజయనగరమునకుఁ దూర్పుగా సుమారు ౮ మైళ్ళ దూరములోనున్న 'కుమిలి' యనుగ్రామమే నాఁటికాలమునఁ గుంభిళాపురనామముతో రాజధానీనగరమై యుండెనని పూసపాటిరాజులకుఁగల పూర్వబిరుదములలోని "స్థలదుర్గకుంభిళాపురనికేతనుఁడను' అను దానివలనఁ దెలియవచ్చుచున్నది

క్రీ శ ౧౭౫౭ సంవత్సరమున బొబ్బిలియుద్ధములో వీరస్వర్గముగాంచిన విజయరామగజపతిమహారాజునకు నీవేంకటపతిమహీరాజు పెదతండ్రి ఈయన తమ్ముఁడును, విజయరామరాజు తండ్రియునగు ఆనందగజపతిమహారాజు* బాలుఁడై యున్న కాలమున నీవెంకటనృపాలుఁడే రాజ్యభారమును వహించి తమ్మునికిగాఁ బరిపాలనమొనర్చుచుండెను విజయనగరమునకుఁ బడమరగా గోస్తనీతీరముననున్న "కొర్గాము" అనుగ్రామము శా శ ౧౬౩౭ సంవత్సరమునఁ గ్రీ॥ శ॥ ౧౭౧౫ గొన్నిబ్రాహ్మణకుటుంబములకు వేంకటపతిరాజపురమను పేరుతో నీయనచే

న్నగ్రహారముగా నీయఁబడియెను ఆదానశాసన మిచట నుదాహ రింపఁబడినది

శ్రీశస్తు శాకే సప్తర్షిరామశాస్త్రశశభృత్సంఖ్యాయుతే మన్మథే వర్షే మాధవమాసి భానుజయుతే రాకాదివాఙ్జ్రహేశ్చ సాధ్వే సస్యవిధేయభూతమము దే కొర్గాముసంజ్ఞం పురమ్। విప్రేభ్య ప్రదదౌ సవేంకటవిభుశ్శ్రీపూసపాట్యన్వయః॥

శ్రీమాన్ వేంకటభూపతి శ్రితనిధి శ్రీపూసపాట్యన్వయ।
స్సార్ధేభ్యో నిజ పార్థివిద్భ్య ఉదధి శ్రీ వైష్ణవేభ్యోదదౌ।
చత్వారింశదిమంసఖూర్జితతమం కొర్గాముసంజ్ఞంపురం।
కృత్వా వేంకటరాజపట్టణ మితిప్రఖ్యాతమూర్వ్యాంసదా॥

స్వస్తిశ్రీ శాలివాహనశకవర్షంబులు ౧౬౩౭ అగు నేటి శ్రీమన్మథనామసంవత్సరవైశాఖ శు॥ ౧౫ స్థిరవారము నందు ౧ శ్రీ వొడ్డె జగ్గుభట్లుగారు, ౨ సోమయాజుల వేంకటావధానులు, ౩ కర్రి రామభట్లు, ౪ కర్రా విశ్వేశ్వరభట్లు మొదలయిన బ్రాహ్మణులకు శ్రీ మన్మహామండలేశ్వర మహీమండల రాయ మన్యసుల్తాన్ శ్రీ పూసపాటి వేంకటపతిరాజు మహారాజులుంగారు వ్రాయించియిచ్చిన అగ్రహారపుధర్మశాసన పట్టా-మా మొఖాసాసమతు పొట్నూరుసీమతాలూకు కొర్గాం అనే గ్రామములోను యిరవై వక్కవృత్తి నిర్ణయంచేసి యిస్తిమి గనుక యిందుక్కు ౧ వొడ్డెజగ్గుభట్లు, ౨ సోమయాజుల వేంక

టావధానులు, 3 కద్రిరామాభట్లు, ర కద్రావి శ్వేశ్వరంభట్లు, గి బులుసు జగ్గంపట్టుడు,౬ యనమంద్ర విజ్జంభట్లు, ౭ పూడికంటి వేంకటభట్లు ౮ వేదుల యజ్ఞంభట్లు, ౯ ఆత్రే నరసంభట్లు, ౧౦ నిట్టల రామాభట్లు, ౧౧ కాశీసోల్ల బుద్రిభట్లు, శ్రీ రంగం నారాయణభట్లు జ్ఞు ౨కి ౧౨ దేవరకొండ నారాయణభట్లు, ౧3 యర్రగుంట్ల సూరుభట్లు, ౧ర నిట్టల చినరామభట్లు, ౧గి అయిప్సోలల చెనులు ౧౬ గంటి సోమయాజులుగారు, ౧౭ వేదుల సీతారాముడు, ౧౮ అవధానుల కామాభట్లు, ౧౯ ఇంద్రకంటి లింగంభట్లు, ౨౦ భాస్కరభట్ల అప్పలిభట్లు, ౨౧ వేదుల విస్సంభట్లు,యీ వొప్పంద మర్యాద చేసి వేంకటపతిరాజపురం పేరుపెట్టి శ్రీసీతారామార్పణముగాను వాపీకూపతటాకారామనిధి నిక్షేప ప్రజాసహితంగా యిస్తిమిగనుక ఆగ్రామం విరివిగా ఫలపరుచుకొని అందుల ఫలసాయం మీ పుత్ర పౌత్ర పారంపర్యాయం అనుభవిస్తూ సుఖానవుండేది

ఏకైవభగినీలోకే సర్వేషామపిభూభుజాం।
నభోజ్యానకరగ్రాహ్యా విప్రదత్తావసుందరా।
స్వదత్తా దుహితాచైవ పితృదత్తాచసోదరి।
అన్యదత్తాచ మాతాస్యాద్విప్ర దత్తావసుంధరా।

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ

శ్రీ వేం

చేల్పూరి వాపయప్రాస్తే పోటాన్నారుపరాబు కొమ్మోజు గురివన్న మండ శివ్వన్న చెక్కినదానపత్ర

N B ఈప్రకారముగానే చేటాక దానశాసనము ౧౯ వృత్తు లేర్పఱచి శ్రీ అళఘురుతిరుమల గొడవర్తి శ్రీ వేంకటపతి అయ్యవార్లంగారు మొదలగు వైష్ణవులకుఁగూడ నిదే కాలమున నిచ్చియున్నారు

దానశాసనము కాలమునుబట్టి చూడఁగా నీ వేంకటపతి రాజకవికాలము క్రి శ ౧౬౬౦-౧౭౨౦ మధ్యకాలముగాఁ గనఁబడుచున్నది ఈయన అన్నమనృపాలుని పౌత్రుఁడు కృష్ణమరాజుపుత్రుఁడు తల్లి కేసమాంబ వీరినిఁగూర్చి యితఁడు తనప్రబంధమగు "ఉషాభ్యుదయములోఁ గృత్యాదిని నిట్లు ప్రశంసించియున్నాఁడు

సీ లయకాలజలాధీనమాలిక
మించి శాత్రవులభంజించువేళ
స్థిరసాంద్రచంద్రికా పరిపూర్ణచంద్రుఁడై
లీనభూజనులఁ బాలించువేళ
దశశతవదనప్రధానభోగీంద్రుఁడై
లసితకళాప్రౌఢి వెలుపువేళ
ఎహుదరసఫలచరితమందారమై
మొనరనరులకోర్కె లొసఁగువేళ

గీ. నితఁడు పిర్వజనులు సంప్రీతిఁగొల్వ
నలరుచుండెను బూసపాట్యన్వయాబ్ధి
చంద్రుఁడగు కృష్ణరాజేంద్రచక్రవర్తి
నందనుండన్న భూపపురందరుండు

గీ. అమ్మహీపతి పరిణయంబయ్యె వేడ్క
దినదినిపూరి వేంగళేంద్రమనిసుపుత్రి
నమితకల్యాణకలిత విఖ్యాతమహిత
విమలసద్గుణనికురంబ వేంకటాంబ.

గీ. ఆ వధూమణియందు నెయ్యంబుతోడ
నన్నభూపతిగాంచె విఖ్యాతులైన
సుతుల నిరుపుర త్యంతశుభగమతులఁ
గృష్ణభూపాలు గోపాలకృష్ణవిభుని

సీ. శ్రుతిపదరహితుఁడై యతిభక్షనుబుజగ
త్రాణిభక్షించినవానిఁదెగడి
శిరములఁ గుంభముల్ ధరియించు చాలఁ
దరలకినిల్చు దిక్కరులఁగెడచి
సానుల శిఖరసంచయముల నెవ్వేళ
మునుతఁగైకొను గోత్రసమితిరోసి
ఒకయచలాధిపుంను కణఁకఁదనునంట
వెన్నుజూపిన కూర్మవిభుని మాని

గీ. చారువిజ్ఞాను నాశ్రితజన నిధాను
నన్యకాంతాస్య విముఖు సౌజన్య సుముఖు
విరకృష్ణమహీపాలుఁ జేరె నౌర!
ధీరగంభీరమతిని ధాత్రీపురంధ్రి

గౌష్టముక్కలవంశాబ్ది కువలయాప్తుఁ
డనఁగఁ జెన్నొందు బంగారు జనవరేణ్యు
తనయయైనట్టి కేసమాంబను వరించె
మజ్జనుకుఁడైన కృష్ణక్ష్మావిభుండు

సీ. తనతండ్రి యెపుడప్పులను భంగమును జెంద
గనుఁ ట్టి యేపాట కలిమిపాలఁతి
తనపుత్రకుం డపుత్రకునిగాఁ గనునట్టి
గంగ యేపుణ్యసంకల్పవతియొ
తనపతి బహుళార్తినెనయఁ గనుంగొను
రోహిణి యేయనిరుద్ధచరిత
తనసుతు పెండ్లిసేయను నేరకమెలంగు
పర్వతాత్మజ యే సుభద్రపదాత్రి

గీ. యనఁగవిలసిల్లెఁ బతిహితాయత్తయగుచు
పూసపాట్యన్న మేదినీభుజుని కృష్ణ
రాయవిభురాణి మాధుర్య రమ్యవాణి
కీర్తిసద్గుణ నికురంబ కేసమాంబ

రాజ్యభారమును వహించుటకుఁ దగినవయస్సు తనతమ్ముఁడగు నానందరాజునకు వచ్చినంతనే యీవెంకట నృపాలుఁడు రాజ్యపాలనాదికము నాతనికిచ్చివేసి తానుగావించిన యగ్రహారమునఁ బ్రత్యహము విప్రులయింటనే భోజనముఁజేయుచుఁ బారమార్థిక చింతకలవాఁడై పండితగోష్ఠిచేఁ దనజీవితశేషమును నొకరాజఋషివలెఁ గడపెనని వినుచున్నాము

ఈమహారాజు రాజకీయవ్యవహారములయందెంతదక్షుఁడో కవిత్వము మొదలగు లలితకళలయందంతసమర్థుఁడు తత్పూర్వులగు రాచిరాజు (నభారతికృతికర్త) తమ్మిరాజు (శ్రీకృష్ణవిజయగ్రంథకర్త)లవలెఁ గవితావిషయమునఁ దానుఁగూడ విఖ్యాతినొందవలెనను కోర్కెతో "ఉషాభ్యుదయ' మను నొక శృంగారరసప్రబంధమును రచియించి తమరాజధాని నగరమునకు ననతిదూరమునగల శ్రీరామతీర్థక్షేత్రమున వేంచేసియున్న శ్రీరామచంద్రునకు నర్పించిని కృతియొసంగెను

ఈ ఉషాభ్యుదయము 5 ఆశ్వాసముల ప్రబంధము ఇందులకథ హరివంశమునందును, భాగవతమునందును,వర్ణింపఁబడిన ఉషానిరుద్ధుల వివాహోత్సవమునే యాధారముగాఁ జేసికొని యీప్రబంధమును రచించినాఁడు. ఇందు మొదటి యాశ్వాసమున——

కృత్యాదిపద్యములును, కృతికర్తవంశావళి, పురవర్ణనాదికము, కైలాసమున బాణునితపము, మహేశ్వరసాక్షాత్కారము, వరప్రదానము మున్నగునవి వర్ణింపఁబడినవి

ద్వితీయాశ్వాసమున—వసంతాగమము, ఉషాసౌంద ర్యాభివర్ణనము, కేళికావనవిహారము, అచ్చట నుష మొదలగు యువతీజనమునకుఁ బార్వతీపరమేశ్వరుల సాక్షాత్కారము, ఉషాగిరిజలసంభాషణము, నుషాభావిస్వప్నవృత్తాంతమును, సాయంకాలము చంద్రాద్యుపాలంభనము మొదలగునవి చెప్పఁ బడినవి

తృతీయాశ్వాసము—ఉషాస్వప్నము, విరహము, చిత్ర రేఖయొక్క చిత్రరేఖనాకౌశలము, అనిరుద్ధుని ద్వారకనుండి తెచ్చుట, ఉషానిరుద్ధుల గాంధర్వవివాహము, మున్నగునవి యభివర్ణింపఁబడెను

చతుర్థాశ్వాసమున—అనిరుద్ధునివృత్తాంతము బాణు నకుఁ దెలియుట, వానిఁ గారాగృహబద్ధునిగాఁ జేయుట, నారదుని వలన నీసమాచారము ద్వారకలోనున్న శ్రీకృష్ణాదులకుఁ దెలి యుట, కృష్ణుని దండయాత్ర మున్నగునవి వివరింపఁబడెను

పంచమాశ్వాసము—సంపూర్తిగా దొరకలేదు

ఈవెంకటరాయకవి చక్కని కవిత్వముఁ జెప్పఁగలవాఁడే యైనను, శ్లేషయందు మిక్కిలి మక్కువకలవాఁడగుటచే సరళమగు కవితాప్రవాహము హృదయావర్జకముగాఁ బ్రవహింపక, తద్ర చనకుఁ గొంత లోపము కలిగించుచున్నదని చెప్పవలసివచ్చినది పండితకవిసమాజముచేఁ బ్రబంధరాజముగా నాదరింపఁబడు వసు చరిత్రయొక్క కవితావిధానమునే తనకు నాదర్శముగాఁ జేసికొనిన

వాఁడగుటచే నింవలోని పద్యములు పెక్కులు వసుచరిత్రలోని పద్యముల ననుకరించుచున్నవి మొత్తముమీఁద నీతనికవిత్వము సంస్కృతపదభూయిష్ఠమై, యలంకారశోభితమై నిరర్గళ ధార కలదియై కర్ణరసాయనముగ నున్నది కవికి సంస్కృతాంధ్రముల యందుఁ జక్కనివైదుష్యముకలదని యీప్రబంధమునందలి పద్యములే మనకుఁ బ్రబల నిదర్శనములు కవితాధోరణి తెలి యుటకుఁగాఁ గొన్ని పద్యములిచటఁ బొందుపఱచుచున్నాఁడను

కం కాంతారసహితపల్లవ
సంతతభావనము లలరుసమధికలీలన్
గాంతార సహితపల్లవ
సంతతభావనములంను సమధికమగుచున్

చ అచటియనంతరత్నమయహర్మ్యములొప్పనిశాంతమెంతయున్
ప్రచురతఁదాననంత సుఖపద్ధతిచూడఁ బురాంగనల్ సదా
రుచిఁగని మిత్రుఁడంమి నవరోధముసేయరుగాక జాలక
ప్రచరుఁ డడెంద ఁగోఁగలఁడుపట్టెదమందురు సౌధసీమలన్

మ అలినాథుండు రసాలమంజరుల నొయ్యారంబు దెప్పంగ నా
కులవృత్తిన్ నిజమకావనోదయ రసక్షోభంబుగాఁ జేయు చా
పలబుద్ధిన్ గినియంగఁబోలునుసుమీ పద్మాక్షి! యేలాలతా
వలిచాంపేయము నేలఁజుట్టుకొనుఁ దద్వాటిన్ విలోకించితే

చ అరయరథాంగ విభ్రమము నాఁగవిరుంగలు గప్పిచిక్కవల్
కరువలివారువంబులును గన్నులు సార్థములై సహాయతన్
బరఁగుటనేమొ గాక లలనామణు లేక్రియ నెక్కనోపువా
రరుణ తురంగ ఘర్మసలిలాదృత సాలము కేలిశైలమున్

సీ లీలావలిత భంగిమాలాధికృత తుంగ
డోలాంచిత పతంగ బాలరంగ
మారాజిత పరాగ సారాభ్యవితభోగ
నీరాటన సవేగ తిరిభాగ
మాలంబిత తమాల నిలచ్ఛదనిశాల
బాలత్స్యతత్కాల సాలజాల
మలిచుంబన వికారపుల కోపమితసార
సలతాంత గతసారవల్లిక నార

గీ మనత ఘనతరవినుతి మానట దచ్ఛ
మత్స్యపుచ్ఛాంబు బిందుచామరవినోద
కోకకలహంస జలహంసకుల విలాస
భావరుచిరంబు కేళి సరోవరంబు

కం అథవాకాకు నినాదము
సథవాగీతస్వనంబు సముదిత పరదే
శథవావిలాపమామ
న్మథవీణకుఁ ద్రివిధతాసమానము లెసఁగన్

సీ. సౌందర్య గగనవిస్ఫార మాధారమై
నవవయ పవనసంతతినిదాల్చె
నవవయ పవనసంతతి పెల్లుగొనిపొంగి
విరహానలార్చుల వెలయఁబూనె
విర హానలార్చు లబ్బురముగా వెలుగొంది
కన కొలంకుల నీరు కలుగఁజేసెఁ
గనుకొలంకుల నీరుగబ్బియై పొడగట్టి
కుచధరాభ్యుదయ సంగోష్ఠిమనియెఁ

గీ. కుచధరాతస్థలంబునఁ గోమలికిని
వికల చింతాలతల్ సంభవించెఁ బెలుచఁ
బంచశర పరబ్రహ్మ ప్రపంచమునను
తద్విగుణవృత్తితో నవస్థలుచెలంగ

గీ. జన్మ మమృతాబ్ధి నమృతంబు చక్కఁదనము
పదవి శంకరమౌళియా బాల్యవసతి
యిన్నిగల్గి యనాథల నేచెదేల
కులము రూపంబు కొలఁదిఁ సద్గుణమువలదె

# 5 అడిదము బాలభాస్కరకవి

## (క్రీ శ 1690—1750 సం)

ఎవ్వారు తమయఖండసాహితీపటిమచేతను, నిరర్గళకవితాప్రభావముచేతను, ఆంధ్రవాఙ్మయనిర్మాతలయ్యెరో, యెవ్వారి జీవితచరిత్రము నామమాత్రావశిష్టమై తమతరువాతివారికి విషాదకారణమయ్యెనో యట్టికవి తల్లజులలోఁ జేర్పఁదగినవాఁడగు నీబాలభాస్కరకవి సుప్రసిద్ధాంధ్రకవిశేఖరుఁడగు నడిదము సూరకవీంద్రుని జనకుఁడు ఆరువేల నియోగిబ్రాహ్మణుఁడుం. ఆపస్తంబసూత్రవశిష్ఠగోత్రజుఁడు నారపామాత్యుని పౌత్రుఁడు చినలచ్చనమంత్రి పుత్రుఁడు కాపురము విజయనగరమునకు సమీపముననున్న భూపాలరాజురేగ (పూసపాటిరేగ)

18 వ శతాబ్దోత్తరభాగమున శ్రీవిజయనగరసంస్థానమున నాస్థానకవిగానుండిన యీతని కుమారుఁడగు సూరకవి, క్రీ శ 1720 సం॥ర ప్రాంతమున జననమొందియుంటచే నాతని తండ్రియగు నీబాలభాస్కరుఁ డప్పటికి 25 సంవత్సరముల ప్రాయముగలవాఁడై యుండవచ్చునని మన మూహించినచో నీతఁడు 1690 ప్రాంతమునఁ బుట్టియుండవలెను అట్లనికొనినచో నీతనికాలము 1690—1750 మధ్యకాలమై యుండనగును ఈ ప్రకార మూహించిచూడ నీబాలభాస్కరకవి ఉషాభ్యుదయ గ్రంధకర్తయగు శ్రీ పూసపాటి వేంకటపతిమహీపాలునకు సమకాలికుఁడుగా నుండనోపును

సూరకవి తన "కవిసంశయ విచ్ఛేదము"నం గృత్యాది యం దీభాస్కరకవిని నిట్లు స్తుతించియున్నాఁడు

క. చిలచ్చమంత్రి తనయుని
నన్ఘుని మజ్జనకు భాస్కరామాత్యమణి-
గొనియాడెద శ్లాఘాలం
ఘనజాంఘికి కవనధాటి గలిగినమేటి-

ఈస్తుతినిఁబట్టి చూడఁగా బాలభాస్కరకవి కవితావిష యమున గొప్పసామర్థ్యముకలవాఁడుగాఁ గనఁబడుచున్నాఁడు ఇతని కవనధాటిని నిదర్శనపూర్వకముగాఁ జూపులకుఁ దగిన సాధనసామగ్రి లేకుండుట యెంతయుఁ జింతాకరము ఇతఁడు శుద్ధాంధ్రరామాయణఘటనావైదుషీధురంధరుఁడని సూరకవి తన గ్రంథములో వేసికొనిన గద్య యి ట్లుద్ఘోషించుచున్నది "ఇది శ్రీమదశేషమనీషిహృదయంగమమృదుపదనీరంధ్రశుద్ధాం ధ్రరామాయణఘటనావైదుషీధురంధరాడిదము బాలభాస్కర కవి తనూభవ" అనియున్నది

దీని కుపబలముగా సూరకవి తన కవి సంశయవిచ్ఛేద ములో "ఇడఁగవచ్చునుల్యాప్తపై సిత్వసంధి మాత్రమొక్కొ క్కచోటను మట్టుమీఱు" అను లక్షణమునకు లక్ష్యముఁజూపు సందర్భమునఁ బ్రామాణికగ్రంథములనుండిచూపిన యుదాహ రణములతోఁబాటు "బాలభాస్కరకవికృత శుద్ధాంధ్రరామా యణమునుండి" యనివ్రాయుచు

"నిగిడెరువై పుల్క వెడలు నేటయి నిటగుపీటికోట" అను చంపకమాలికాపాదము నుదాహరించియున్నాఁడు మీఁది యంశములను బట్టిచూడఁగాఁ గూచిమంచి తిమ్మకవి అచ్చ తెనుఁగు రామాయణమునకుఁబూర్వమే యీకవిగ్రామణి తన శుద్ధాంధ్ర రామాయణమును రచించినట్లుగఁదెలియుచున్నది కాని యీగ్రంథము నామమాత్రావశిష్టమైనదగుటచేతఁ బ్రకృతోపయోగము కాఁజాలదు

ఇంక నీమధ్యననఁగా రెండుమూఁడు సంవత్సరముల క్రిందట శ్రీ శ్రీ శ్రీ విజయనగరం మహారాజావారి కాలేజిలో నాంగ్లసాహిత్యోపాధ్యాయులగు శ్రీయుత బుర్రా శేషగిరిరావు పంతులవారి యౌదార్యమున "లక్షణసారము" అనునొక ఛందో గ్రంథముయొక్క రెండుప్రతులు నాకు లభించినవి వీనిలో నొకటి శ్రీ బొబ్బిలి సంస్థానాస్థానకవి పదవి నలంకరించిన వారును, కర్తిశేషులగు బ్ర॥ శ్రీ॥ మండపాక పార్వతీశ్వరశాస్త్రిల వారి పుస్తకభాండాగారములోనిది దీనిముఖపత్రముమీఁద "అక్షరోత్పత్తిఫలాలు గణములకు అష్టాదశలక్షణములు, అడిదము బాలభాస్కరకవి" అనియున్నది అంతియెగాని గ్రంథమున నారంభముననఁగాని యంతమందుఁగాని రచయితపేరు గానరాదు రెండుమూఁడుచోట్లను "అడిదము బాలభాస్కరకవి రచన" యని ప్రకరణ ప్రారంభమందు వ్రాయఁబడియున్నది

ఈ వ్రాత రమారమి 120 సం రముల క్రిందటి కాలమున వని నా యనుటకు పుస్తకము చివర నిచ్చిన సమాచారమునుబట్టి తెలియవచ్చుచున్నది 'పింగళ సంవత్సర భాద్రపద బ 30 బుధ వారం నాడు మండపాక లచ్చన్నకుమారుఁడు కామన్న ఆలవెల్లి వారి ప్రతి చూచి ప్రతిశ్రమంగా పెంచాలు సంపూర్ణంగా వ్రాసుకొనెను" అనియున్నది

ఈపుస్తకము వ్రాసికొనిన మండపాక కామన్నగారు 120 సంవత్సరముల క్రిందటి కాలమునవున్నట్లు తద్వంశజులును త్రిలింగభాషాభివర్ధని గ్రంథమాలా సంపాదకులును నగు శ్రీ మండపాక రామశాస్త్రిలవారు చెప్పుచున్నారు కాఁబట్టి పైని నుదాహరింపఁబడిన పింగళసంవత్సరమిప్పటికి నలువదియారు సంవత్సరముల క్రిందటి పింగళసంవత్సరము గాక 126 సంవత్సరముల క్రిందటి సంవత్సరమని తోఁచుచున్నది కాన రమారమి 130 సంవత్సరముల క్రిందట వ్రాయఁబడిన మండపాకవారి ప్రతికి మాతృకయగు నాలివెల్లివారి ప్రతి ప్రాచీనతరమని వేరుగఁ జెప్ప నక్కఱలేదు

ఇంక నీలకుణవారము యొక్క రెండవ ప్రతి బాలభాస్కరకవి నివాసస్థలమగు "భూపాలరాజు రేగ" యను కాపురముగాఁ గల ఓరుగంటి రామన్నగారు వ్రాసినది ఈ రామన్నగారు ఇప్పటివారికి మునిముత్తాతలగు బ్ర॥ శ్రీ॥ ఓరుగంటి సన్న్యాసయ్యగారికి ప్రాగ్వపురుషులు తరమునకు 30 సం॥ లు లెక్కించి చూచి

వచో లేఖకుడగు రామన్నగారికాలము 120 సం॥రముల క్రిం దటి కాలమని తేలుచున్నది కాబట్టి మీదియంశములనుబట్టి విచారింపగా రమారమి 150 సంవత్సరముల ముందటికాల మున గవితాలోకమున నీ "లక్షణసారము" అడిదము సూర భాస్కరకవి ప్రణీతమని ప్రచారముగానున్నట్లు మనము నిశ్చ యింపవచ్చును

ఇంకి నీగ్రంథము విజయనగరసంస్థానమునకు చెంద యున్న శ్రీ రామతీర్థక్షేత్రమున వెలసియున్న శ్రీరామచంద్రు నకు గృతియీయబడినది ఈదిగ వపద్యములచే దెలకింపుడు

కం శ్రీమనుకులాబ్ధిసోమా
సామజవరవరద నీలజలదశ్యామా
కామారివినుతనామా
శ్రీమందిర రామతీర్థ సీతారామా

గీ రఘువరాయన'నగ' మెప్పు నఘవిదూర
రఘువరయనంగ'నేము' పురాణపురుష
'నేము రఘువీరయనగ రాజన్యతిలక
రాక్షసవిరామ రామతీర్థగిరిధామ

దీనినిబట్టి కవి విజయనగరప్రాంతమువాడని చెప్పుటకు వీలగుచున్నది ఆనాడు శ్రీ పూసపాటి మహారాజులేమి, వారి పోష్యజనములోచేరిన కవులేమి తమ కృతులను రామతీర్థ శ్రీరామచంద్రునికే యర్పించుచు వచ్చినటులగనబడుచున్నది

శ్రీ పూసపాటి వేంకటమహాపతి యుపాధ్యాయునకుఁ గృతి పతి రామతీర్థస్వామియే ఈ బాలభాస్కరుని శుద్ధాంధ్రరామాయణము శ్రీరామునకుఁ గృతియనియె మా వంశమందు నిలిచి యున్న వాడుక ఇదిగాక "చెఱువుమీఁది పద్యములు" చెప్పిన "అడిదము రామకవి" "సరోజనేత్ర రామతీర్థ జానకీమనోహరా" యనుమకుటముతో 'పంచచామర వృత్తములను" రచించి యావేల్పునకే కృతి యొసంగెనని ప్రబలమగు వాడుక గలదు కాఁబట్టి శ్రీరామతీర్థశ్రీరామచంద్రునకు సమర్పింపఁబడిన యీలక్షణసారమును రచించినది యీప్రాంతమువాఁడగు బాలభాస్కరకవియే యని మనము ప్రస్తుతము నిశ్చయింప వచ్చునని నా యభిప్రాయము గ్రంథస్థ నిదర్శనములు (Internal evidence) లేకపోయినను జనశ్రుతి మున్నగు బాహ్యనిదర్శనములు (External evidence) వల్లఁ గలుగు చున్న కర్తృత్వ మీకవికి నారోపించియే తద్గ్రంథమునుగూర్చి కొంత ముచ్చటించుచున్నాను

ఈలక్షణసారములో నీక్రింది విషయములు తొమ్మిది ప్రకరణములుగా వివరింపఁబడినవి 1 అక్షరోత్పత్తిప్రభవములు 2 అక్షరముల యష్టాదశలక్షణప్రకారము 3 గురులఘువులు గణప్రస్తారము 4 ఛందఃప్రస్తారము 5 వృత్తనిర్ణయము 6 కవితాదూష్యములు 7 ప్రయోగాదులు 8 నాయికానాయక విభాగము 9 గ్రహమైత్రీప్రకారము

కవి యీగ్రంథమును జేయుటలో దిగువనియఁబడిన లక్ష్యలక్షణగ్రంథసహాయమును గైకొనినట్టుగఁ గనఁబడు చున్నది

1 కవితాలక్షణసారము 2 కవిగజాంకుశము 3 సులక్షణసారము 4 కవిజనాశ్రయము 5 అథర్వణఛందము 6 శ్రీధరఛందము 7 ఉభయభాషా కవి మనోహరము 8 గోకర్ణఛందము 9 నరసింహభాగవతఛందము 10 కవిజన చింతామణి 11 కవికంఠపాశము 12 ఉత్తమగండఛందము 13 కవికుముదసుధాకరము

1 భారతము 2 భాగవతము 3 రామాయణము మున్నగునవి

ఈ "లక్షణసారము" వంటి లక్షణగ్రంథములు ప్రాయికముగఁ గవులకవితాకారశక్తినిజూప నవకాశమియ్యనట్టివి అయినను గ్రంథాంతరము లేమిచే నీగ్రంథమునుండియే రెండు మూఁడు మాదిరిపద్యములఁజూపి యింతటితో నీవ్యాసమును ముగించుచున్నాఁడను

శా. పద్మప్రోద్భవసన్నిభుల్ సుజనసంప్రవ్యక్త తాంగంబులన్
పద్మాప్తాంచితవిభ్రమంబుగ సముత్పాదింతు రుద్యన్మతిన్
పద్మాప్తాయ నిజాంఘ్రిసంశ్రితమహాపద్మాయ యోగీంద్రహృ
త్పద్మస్థాయ నమోస్తు తే యనుచు నీశార్దూలవిక్రీడితల్

ఇంక నితని నివాసస్థలమునుగూర్చి స్పష్టముగాఁ దెలిసి కొను నాధారమంతగాఁ గానరాదు ఇతఁడు చిన్నతనములో నవఁగా విద్యాభ్యాసము చేయుకాలమున శ్రీరామతీర్థములో నున్నట్లుగఁ దెలియవచ్చెడిని. ఏలనన, ఇతని గురువులగు వేంకటాచార్యులవారు శ్రీరామతీర్థవాసులు కూర్మనాథుఁడు చదువు ముగించినవెనుక శ్రీ విజయనగరసంస్థానము దేవస్థానపు శాఖలో నుద్యోగియై, శ్రీరామతీర్థము, కూర్మనాథము, సింహాచలము మొదలగు స్థలములయందు నుండుచు వచ్చెనని చెప్పుదురు తన జీవితకాలములో కడమభాగము గజపతినగరమునకు సమీపముగానున్న దేవుపల్లిగ్రామములో నుండెను అచ్చటనున్న కాలముననే యీతఁడి 'మృత్యుంజయవిలాసము" ను రచించినట్లు తెలియుచున్నది ఎట్లన -

గీ. పరమభక్తుని గోకులపాటికూర్మ
మాత్రి మృత్యుంజయవిలాస మధురకావ్య
మెలమి వినుచును సన్నిధినుండివ్రాసె
గగనాపుర్తి హరిహరందాసనుచు డు

పై పద్యమందుఁ జెప్పఁబడిన ఆపుర్తి హరిహరందాసుని వంశజు లిప్పటికిని దేవుపల్లిలో నివసించుచున్నారని తెలియ వచ్చెడిని అంతియగాక దేవుపల్లిగ్రామమున నిపుడు దేవాలయ మున్నస్థలము పూర్వము గోకులపాటివారియింటి నివేశనమని

కూడఁ జెప్పుచున్నారు ఈహేతువులఁ బట్టిమాడఁగాఁ గూర్మ నాథుఁడు కొంతకాలము దేవుపల్లిలోనున్నాఁడను వాడుక సరి యైనదని తోఁచుచున్నది ఇతఁ డద్వైతశాఖలోఁజేరిన బ్రా హ్మణుఁడయ్యు వైష్ణవప్రపత్తిగలవాఁడై వైష్ణవగురువుల యొద్ద శుశ్రూషచేసి విద్యాభ్యాస మొనర్చినవాఁడుగాఁ గనఁ బడుచున్నాఁడు అధ్యాత్మికవిద్యాగురువులగు వేంకటాచార్యులు వారే యీతని సాహిత్యవిద్యాసంపాదనకుఁ గారణగురువులై యుండనోపుదురు ఇత డిప్పటికి రమారమి 200 సంవత్సరముల క్రిందటికాలమున నుండినవాఁడు విశాఖపట్టణము 'డిస్ట్రిక్టు మ్యాన్యుఅల్' నందితనిఁగూర్చి యిట్లు చెప్పఁబడియున్నది "గోకులపాటి కూర్మన్న — ఈయన ఇప్పటికి 150 సంవత్సరముల క్రిందట నుండెడవాడు విజయనగరసంస్థానికులైన మొదటి యానందరాజుగారి యనుకు పోషకుడు మృత్యుంజయవిలాస మనే గ్రంథమును నియన రచించినాడు" పుట (132, 133)

* * * *

కూర్మనాథకవిరచించిన గ్రంథములు — 1 మృత్యుం జయవిలాసము 2 సింహాద్రినారసింహశతకము 3 లక్ష్మీనా రాయణసంవాదము(ప్రబంధము) 4 సుందరిమణిశతకము మొద లగునవి పైవానిలో మొదటిరెండును ముద్రితములై ప్రచార ములోనున్నవి

## మృత్యుంజయవిలాసము

ఇది యక్షగానము మూఁడాశ్వాసముల గ్రంథము కవి దీనిని శృంగారనాటకముగను బ్రకటించితినని చెప్పియున్నాఁడు ఇందలికథ యందఱకుఁ దెలిసినదియె ఇందు మొదటి యాశ్వాసమునఁ బార్వతిజననము మొదలు దక్షునియాగమున సతినికటంబు మన్మథసంహారము మొదలగునవి వర్ణింపఁబడినవి రెండవయాశ్వాసమున మన్మథుఁడు శివుని యోగమునకుఁ జనుట శివునితీర్థయాత్ర, పార్వతీపరమేశ్వరుల పరిణయోత్సవము, కుమారోదయము, తారకాసురవధ, మొదలగునవి వర్ణితములు ఇది యక్షగానమైనను, నాంధ్రవాఙ్మయమందుఁగల ప్రసిద్ధ ప్రబంధములతో నెల్లవిధములఁ దులదూఁగుచు హృద్యములగు వర్ణనాంశములతోఁగూడి చదువరులకానందము గలిగించుచున్నది కవికిఁ గలనిరుపమానసాహితీపటిమయు, సంగీతకళావైదుష్యము నీ గ్రంథము వెల్లడిచేయుచున్నది కవి యుభయభాషలయందుఁ జక్కని పాండిత్యముగలవాఁడనియు, నతనికల్పనాకౌశల మతిమనోహరమై కవిత్వము ప్రబంధరీతుల ననుకరించుచున్నదనియు నీక్రిందిపద్యముల వలనఁ దెలియనగును

ఉ. నాయనుకూలభాగ్య సదనాయచు నవ్విడనాడ నాయమా
నాయను, నిన్నుఁ బాయఁగలనాయను నీవెతకోర్చుదాననే
నాయను, వేఱుసేయఁ దగునాయను నోమిదసామజంపుగు
న్నాయను, బల్కవేమి పదనాయను నేఁబగదాననాయనుక్

శాసుచేయు సమయమునఁ గూర్మనాథకవి శత్రుసంహార మహా క్షీంచి, దీనిని వ్రాసెనఁట ఆసమయమునందుఁ గలిగిన యల్లజడి యిట్లు వర్ణింపఁబడినది

సీ. నీకొండపై నెక్కి నియతుతాఁభస్తుల
గొట్టి నానావస్థఁ బెట్టుకుండ
గాంగదారాతర కిలితమంతెక్కుఁ
మద్యపానముచేసి మలయుచుండ
నీవంటశాలలో నిశ్శంకతో మాంస
ఖండముల్ వండఁగా వండకుండ
నీగుడిఁజొచ్చి దుర్నీతిఁగా మాంధులై
పరవధూటుల భంగపఱుపకుండ
పౌరుషంబునఁ దుఱకలఁ బొందఁడుము
వేఁటకాఁడిల మెత్తినా వెళ్ళ లేఁడి
మూఁడుకాళ్ళనడుగు నిర్మాలితాంహ
వైరిహరరంహ సింహాద్రి నారసింహ

సీ. యవనేశుధాటికి నడలి సర్వస్వమ్ము
విడిచి మందిరములు వెడలువారు
వెడలియుఁ దలదాఁప వెరవేమిగానక
యడవుల నిలుమలఁబడెడివారు
పడియు నెచ్చటఁ గూడ గుడువఁగానక
తమశిశువులతో వెతఁజెందువారు

వెండికొండవుగుండఁ గాంచిశీకతనభి
మానార్హమైమ ఖమూనువారు
౨ నైరి యొక్కొక్క భార్యతో నవనిప్రజలు
అష్టమహిష్యలపైఁబడియాఱువేల
సతుంతో నివ్వ వలసయెచ్చటికరిగెదు
వైరిహారరంహ సింహాద్రి నారసింహ
౩ "నీరు హుక్కా పకడో రెగద్దా" యని
యూహాతొగ్నుల నెత్తుఁణఁపకుండ
"పాముధో నేకుతుంపానిలా రే" యని
తివిరిశ్రోత్రియులమర్దింపకుండ
"ఘూసులారే అకేగాండూ' యనుచు శిష్ట
తతులపైఁబడి వడిఁ దన్నకుండ
"కులితీపకావ్వరేజలిదీ యటంచుమూఁ
రుఁగి మెడ వడిఁబట్టి త్రోయకుండ
౪ బహులహాలా మదావిలపరుషయవన
రాజనిర్జింపు నెవంటిప్రభువుగల్గ
బ్రాహ్మణుల కిన్ని పాట్లు రామగాదె
వైరి హారరంహసింహాద్రి నారసింహ

ఇట్లుబడియగునవిపద్యములు సెప్పుసరికి భగవంతునిచేఁ బంపఁబడినకోయిన సేనవేలుగఁ దుమ్మెదలు చెంరేఁగి కొల్ల గొండ్రచుబొడిచి రక్తముఁద్రావి చంపెనఁట కొందఱునిశాఖ

పట్టణమువఱకుఁ దఱిమి యచ్చటనున్న మెట్టలోఁ జొచ్చి యదృశ్యమాయెనఁట ఆమెట్టకు నిప్పటికిని "తుమ్మెదలమెట్ట" యనియేపేరు ఈసంగతులను దేటపఱుచు పద్యములను రెంటి నీక్రిందఁ బొందుపఱుచుచున్నాను

సీ కారుణ్యదృష్టి చేగని మముఁ్మరక్షించి
 నీరజేక్షణ నెవు నేఁడుపంపఁ
బారసీకులదండుపైఁ గొండలోనుండి
 గండుతుమ్మెదలు నుద్దండలీలఁ
గల్పాంతమున మిన్నుఁగప్పి భీకరమైన
 కారుమేఘంబులు గవిసినట్లు
డాఁకిబోరున రక్తధారలు దొఁగఁగాఁ
 గఱచి నెత్తురుఁబోల్చి కండలెల్ల
గీ, నూఁది పడ నుక్కుముూతుల వాడిమెరపి
 చించి చెండాడి వధియించెఁ జిత్రముగను
నొక్కొకనిఁ జుట్టుముట్టి బల్మిక్కుటముగఁ
 వైరి హారరంహసింహాద్రి నారసింహ

గీ అరులఁ బరిమార్చి వైశాఖపురసమీప
 గిరిబిలంబున డాఁగె బంభరములెల్ల
 నదిమొదల్ "తుమ్మెదలమెట్ట" యంద్రుదాని
 వైరిహారరంహసింహాద్రి నారసింహ

ఆంధ్రవాఙ్మయమునకు నలంకారమై వెలయుచున్న ప్రసిద్ధశతకములలోని "వరాహనృసింహశతక" మగ్రస్థాన మాక్రమింపదగినదని నిశ్చయముగాఁ జెప్పవచ్చును ఇక రెండవదియగు "సుందరమణిశతకము" నేటివఱకు నచ్చుపడలేదు మదరాసులోఁ బ్రాచ్యలిఖిత పుస్తకాలయములో నసమగ్రమగు నొకప్రతి 80 పద్యములుగలది యున్నదని వినవచ్చెనని మా మిత్రులు శ్రీయుత నిడదవోలు వెంకటరావుపంతులు బి ఏ గారు ఈశతకములోని కొన్ని పద్యములను సంగ్రహించి 'కళింగదేశపు శత వాఙ్మయము" అనుపేరితో తాము వ్రాసిన వ్యాసమం దుపయోగించియున్నారు ఆపద్యములనే మాదిరిపద్యములుగా నిందుఁ గొన్ని పఱచుచున్నాము

ఉ శ్రీలలరంగఁ జంద్రికగ చెల్వగు వెదుచు నవ్వువెన్నెలల్
గీలుకొలంక నంగజశిలీముఖరీతి జెలంగుచున్న నీ
లీలకచంగొనరిన యులీలనఖండ సమస్తహారమం
జేసిన నన్ను సౌఖ్యమతి మొందు జుమీ మది సుందరీమణీ

ఉ సగసములాడ నేర్చు కనుసైఁగలు చేసెడు నేర్చు నామనం
బెఱిగెడు నేర్చు నెమ్మదినోర్కించు కోపము సేయు నేర్చు ప్రే
మ్మఱుముజిపంబుతోడ బ్రతిమాలెడు నెమ్మనోజకేళులం
గెలిగెడు నేర్పు నీకెదగు గాదె తలంపగ సుందరీమణీ

ఉ లేవఎనస్య చంద్రదపచి ధిక్కరణ ప్రవిభాస్తుతే దృశో
భావభవోత్పలాంబురుహ బాణకదంబజయోస్తు సంతతం

## 6 రేకపల్లి సోమప్పకవి

(క్రీ॥ 1720—1790 సం)

ఈతని వాస్తవికపేరు సోమప్పశాస్త్రి ఈతఁడు వైదిక బ్రాహ్మణుఁడు సూర్యనారాయణసోమయాజి పుత్రుఁడు జన్మము గోదావరిమండలములోని తాళ్ళపూడి ఈయనకు ముప్పదిసంవత్సరముల యీడు నీయ తండ్రిగారు స్వగ్రామమగు తాళ్ళపూడిలోఁ దిరుగాఁ గడవనందున సకుటుంబముగా సత్యవరమునకుఁ గాపురము వెళ్ళిపోవచ్చి సత్యవరము విశాఖపట్టణమండలములోఁ 'దాండవనదీ' తీరమునఁ 'దునిక' రెండు మైళ్ళదూరములోనున్నది ప్రస్తుతమున నయ్యది చిన్నపల్లెగా నున్నను సోమప్పశాస్త్రికాలమున శ్రీ కాకర్లపూడివారికి రాజధానియై యుండెను ఆదినములలోఁ గాకర్లపూడివారిలో నొక కుటుంబము సత్యవరములోను, మఱియొకకుటుంబము "మేళుపాక" లోను వేఱొక కుటుంబమువారు "అనకాపల్లిలోను" రాజ్యము చేయుచుండినట్లుగఁ గనఁబడుచున్నది

సోమప్పకవి కాలనిర్ణయమును సులభముగాఁ జేయవచ్చును ఈతఁడు సుప్రసిద్ధుఁడగు అడిదము సూరకవికి సమకాలీనుఁడును ప్రబలప్రతిస్పర్ధియునై యుండెను అడిదము సూరకవి 18 వ శతాబ్దాంతరభాగమున శ్రీ విజయనగరసంస్థానము నాస్థానకవిగానుండినట్టుగనిదర్శనములు పెక్కులుగలవు కావున ని సోమప్పకవి యాడ నది యేకాలమునున్నవాఁడని మనము

నిశ్చయింపవచ్చును ఈయిరువురకవీశ్వరుల స్పర్ధవిషయికసమా చారమును గూర్చి యిఁకముందు వ్రాయుచున్నాఁడను, గాఁన నిచట ముచ్చటింపమానితిని

ఆనాఁడు సత్యవరములో రాజ్యముచేయుచున్న శ్రీ కాకర్లపూడి గోపాలరాయపాయకరావు (పాయకరావనఁగా యుద్ధమునందుండువాఁడనియర్థము)గారు సోమప్పకవి కాశ్రయమిచ్చి యాయనను దమ యాస్థానపండితునిగాఁ జేసి మాన్యములొసఁగి యాకుటుంబము నాదరించి సత్యవరమునందె నిలిపెఁ అప్పటికి సోమప్పశాస్త్రి తర్క-వ్యాకరణములయందను, వేదమునందును గొప్ప పాండిత్యముగలవాఁడై యుండెను, గాని యాదినములలో రాజులు ముఖ్యముగ నాదరించుచువచ్చిన తెలుఁగుకవిత్వము నందుఁ బ్రవేశమేమియు లేకుండనుండెను అందుచే నాతఁడు వెలివెల గౌతమరాజను నాంధ్రపండితకవియొద్ద లక్షణగ్రంథములు మొదలగునవి చదివి కవిత్వముచెప్పు నభ్యాసము నచిరకాలములోనే యలవరచుకొనెను ఇతఁ డాస్థానపండితుఁడుగా నున్నకాలమున శానంపూడి తిమ్మకవి యనునాతఁ డాస్థానకవిగా నుండెను గోపాలరాయణింగారికవికి దోసలపా డనునగ్రహారము

---

Tradition has it that the man from whom the place is named was one Kakarlapudi Appalaraju of Chandanadu in this taluk who was granted for service at Hyderabad the title of Payakarao Fore most in battle ' and the estates of Anakapalli and Satyavaram in this taluk" (Vizagapatam Gazetter P P 312 Chapter XV)

నిచ్చి చాల గౌరవించుచు వచ్చిరి. సోమప్పకవి పండితుండుగాం బ్రవేశించిన కొలందికాలమునకే తిమ్మనాయ స్వర్గస్థులైరి. ఆయనకుటుంబములో నాస్థానకవిపదవి నధిష్ఠింప నర్హులెవ్వరును లేకయుండిరి. ఆకారణముచేత రాజుగారు సోమప్పకవినిం దమ యాస్థానకవినిగాం జేసి యొకయగ్రహారమునుగూడ దయచేసిరి.

సోమప్పశాస్త్రినిగూర్చి కొన్నిచిత్రమైనకథలు చెప్పెదరు. వానిలోం గొన్నింటిని యిచట వ్రాయుచున్నాండను —

సోమప్పకవి తొంబదిసంవత్సరములకు పైగా జీవించెనని వాడుక. ఆయనను మూడు వివాహములైనవి. అందులోం గడపటిపెండ్లి యఱువదియేండ్లవయసున జరిగెను. వివాహముచేసికొని పెండ్లికుమార్తెను వెంటంబెట్టుకొని రాజదర్శనార్థము కోటలోనికి వెళ్లగా రాణిగారు "తాతగారూ! పెండ్లికూతురుపేరేమిటి" అని అడుగంగాం బెండ్లికూతురిపేరు పాపమ్మయగుటచే యుక్తిపరుండగు సోమప్పశాస్త్రి 'చెప్పితే పాపమా' అని శ్రీరాణిగారి ప్రశ్నమును గడుస్తనముగాం దప్పించుకొనెను. పిదప వక్కాగ్రపుచెక్కలుపెట్టి తాంబూలమిప్పించి పెండ్లికుమార్తెచేతం దమలపాకులు చుట్టించి యాముసలిపెండ్లికొడుకును దాంబూలము వేసికొనమని కోరంగం బండ్లన్నియుం బోయి బోసివాండై యున్న యీ వృద్ధవరుండు వక్కాగ్రపుచెక్కలు నమలలేక దిక్కులు చూడ మొదలుపెట్టెను. అప్పుడు రాణిగారు — "తాతగారూ! నూరిప్పింతుమా" యని నవ్వుచు నడుగంగా, "అమ్మా తమరు నూరిప్పిం

చితే మిగతా పదహా రెట్లు చెప్పిస్తాడు" అని చమత్కారముగాఁ బ్రత్యుత్తరమిచ్చెను యుక్తియుక్తమగు నతనివాక్యములు రాణి గారు మొదలగు నచ్చట స్త్రీజనము నెంతయు నలరించెనని వేఱుగఁ జెప్పవలెనా ?

ఒకప్పు డేదో కారణముచేత సోమప్పకవిమీఁద జమీందారునకు నసుగ్రహము దప్పినది అంత నాతఁడు శ్రీ విజయ నగరము వెళ్లి మహారాజావారి యగ్రజుఁగుచు దివానునగు శ్రీ సీతారామరాజుగారిని, తనకు వారితోఁగల పూర్వపరిచయ బలమున నాశ్రయించి మహారాజావారి దర్శనలాభముగాంచెను ఆదినము శ్రావణశుద్ధపౌర్ణమి రాజసభ పండితులతోను, కవులతోను నిండియుండెను వేదశాస్త్రవేత్తలగు పండితులు మహారాజునకుఁ గుడివైపునను, కవు లెడమవైపునను గూర్చుండి యుండిరి సోమప్పకవి సత్యవరములో నాస్థానకవిగానుండివచ్చిన వాఁడగుటచేఁ గవులతోఁ గలసియుండెను ఆశీర్వచనసమయమందుఁ బండితులందఱు వేదమంత్రములచేతను, కవులు పద్యములచేతను మహారాజు నాశీర్వదించిరి సోమప్పశాస్త్రి తానుఁ గవులతోఁ గలిసి కూర్చుండియున్నను వేదమంత్రమూలముగా నాశీర్వదించెను మహారాజుగా రెంతయు నాశ్చర్యమును సంతోషమును బొంది, సోమప్పకవినిఁ గుడిప్రక్కను గూర్చుండఁజేసి యాతనికి శాలుజోడాల నొసఁగి సత్కరించిరఁట నాఁటిసభ ముగిసినపిదప మనశాస్త్రిగా రింటికి వెళ్లిపోవుచుండగాఁ గోట గుమ్మముకొద్ద నొకభట్రాజాతనిఁ జూచి —

కం॥ అప్పా! రేకపల్లి సో
మప్పా! విబుధాళిపాళి యమృతపుటప్పా!
ఒప్పుగ నికవికులు చె
న్నప్పాలకు సాటవచ్చునా భళిరుయుటన్

అని చదవఁగా సోమప్పకవి దానిచ్చినట్టి బహుమాన మునఁ బొందిన శాలుజోడా నాథరాజున కిచ్చివేసెను. ఆసమా చార మెట్లో మహారాజావారికి విశదమగుటచేఁగా మరునాటి రాజసభలో వారు "సోమప్పశాస్త్రి మేముచేసిన బహుమానము కోటదేవిడి దాటలేదఁట" అన "మహాప్రభూ! యేలినవారి యీవి యీదేవిడియేకాదు సప్తసముద్రములు దాటినది" అని శాస్త్రి ప్రత్యుత్తరమీయ సరసుఁడగు నావిజయరామగజపతిమహారా జావాక్యచమత్కృతి కెంతయుసంతసించి పేషీక శాలుజోడాను సోమప్పశాస్త్రి కిప్పించి యనేకరీతుల నాతని గౌరవించెను. ఇట్లాతఁడాఱు నెలలకాలము విజయనగరాస్థానమునందుండి మ గుడఁ దనయేలికలకు ననుగ్రహమురాఁగా సత్యవరమునకు వెళ్లిపోయి తన జీవితశేషము నచ్చటనే గడపెను.

అడిదము సూరకవియు నీ సోమప్పశాస్త్రియు సమకా లీనులనియుఁ బ్రతిస్పర్ధులనియు వ్రాసియున్నాఁడను. 'యాచకో యాచితశ్శత్రు" అనువాక్యము వీరిపట్ల సార్థకమైనది. ఈర్ష్యచే వీరొకరి నొకరెత్తిపొడుచుకొనుచుఁ జెప్పిన పద్యములఁ గొన్నింటి నిచటఁ బొందుపఱుచుచున్నాఁడను.

సూరకవి —

కం॥ తెలుఁగుకవిత్వపుమర్మము
కలనెఱుఁగని శుష్కతర్కకర్కశమతికిన్
దెలిసె నొకింయించుకించుక
వెలివెలగాతన్నకృపఁ గవిత్వపుజాడల్

సోమప్పకవి —

తే గీ తర్కకర్కశబుద్ధులై తగినవారి
కేమసాధ్యమటంచు నూహింపరాదె?
తెలుగుముక్కలు నాల్గైదు తెలిసి తాము
కవుల మనుకొన్న వెఱిపాడఁగట్లు మదిని

సూరకవి —

కం॥ ఏమేమొా శాస్త్రంబులు
తామిక్కిలి సతికిసఁట సతకసి కవితా
సామర్థ్యము లెన్నఁగ
సోమసి జృంభణముగలదె? సూరునిమొకటన్

సోమప్పకవి —

తే గీ సోమశబ్దార్థమెఱుఁగని శుంఠవగుట
వదరితివిగాని సూరుని రదనపాళి
రాలఁదన్నిన సోముని లీలఁదెలియ
వైతి సిగ్గట్లు బయలగునవుచుఁగుకవి!

సూరకవి —సీసమాలిక

తట్టెడంతవిభూతి పెట్టి తాతలనాఁటి
కుండలాల్ వీనులఁగునిసియాడ
మైలగ్రక్కెడుశాలు మడతలు నెరసిన
బొడిమిట్ట్రలమీఁదఁ బొసఁగఁజుట్టి
ప్రాతనీరుంగావి పంచెలు * * * *
గనుపింపఁగాఁడొల్లు కచ్చగట్టి
యంగవస్త్రంబుల నతికికుట్టించియట్టి
దుప్పట్లు పైఁ గప్పి తుదలుచినిఁగి
నట్టి పుస్తకములకట్టలు చంకలోఁ
బెట్టి విషంబులు విమలుకొనుచుఁ
బలుగాకిముండబిడ్డలు శిష్యులని కొంద
ఱుపచారముల్ సేయుచుండగా స్వ
యంపాకనిష్ఠులమని వంటగావించి
పదిదినంబుల కొక్క పట్టుఁబట్టి
సంగీతసాహిత్య సరసవిద్యలవారి
పాలిఁటిభూతాల పగిదిఁదవరి
యెంతచక్కని శ్లోకమేని పద్యంబేని
రసమెఱుంగక ముక్కచెతవహించి
యితఁడు పండితుఁగాఁడితఁడు తార్కికుఁడుగాఁ
డితఁడు శాబ్దికుఁడుగాఁ డితఁడుసత్రిక్క

యారసజ్ఞుండగాఁ దనిబుల్కనాడుచు
ఘనవిత్తహరణమన్కఁ దుర్మంగుచుఁ
బరఁగు దుష్పండితబ్రహ్మరాక్షసులచేఁ
గవితారసజ్ఞతకట్టువడియె

గీ. కాన నెరితిఁజూచెదో కరుణ మాదృ
శులకవిత్వ మేరీతిని సూటిఁజెప
రక్షజేసెదొ ? నివు మారక్షకుఁడవు
జానకీరామ ! దేవతాసార్వభౌమ !

అంత సోమకవి గదునర్యయు లోకజ్ఞుండునగు సూరకవి వలనఁ దనకుఁగలిగిన యోటమికి దుఃఖితుఁడై భారతీదేవి నుద్దేశించి యిట్లు చెప్పెను

కం. జిలిబిలిపలుకుల వెలఁదీ !
పలుగాకి నకారగుస్సి పాలై తిగదే
ఇలలో వైదికవిద్వ
త్తిలకంబుల కేమి దిక్కు

ఇట్టి వింకను గొన్నిపద్యములు గలవుగాని గ్రంథ విస్తరభీతిచే వ్రాయమానితిని ఈవాద ప్రతివాదము లెట్లున్నను దనకంటె సుకుమారముగను, మనోహరముగను సూరకవి, కవిత్వము చెప్పుసామర్థ్యముకలవాఁడని సోమప్పశాస్త్రి గుర్తించి యుండినట్టుగఁ గనఁబడు చున్నది ఈక్రిందిపద్యమును దిలకింపుఁడు

మ కనవృత్తుల్ గుణముల్ గణింపఁ యలంకారంబులుం జాతులుం
ఘనవాక్యార్థపదార్థ సంగతు లెఱుంగి న్నరకే యూరకెం
పునఁబాల్యంధికులై రి కొండఱుకివుల్ పుణ్యైర్య్యలభ్యత్వ
యనువాక్యంబుప్రమాణముయ్యెనిపుడాహాచిత్రమిద్ధారుణి-
(రుక్మవతిపరిణయము 1 ఆశ్వాసము పద్యము)

సోమప్పశాస్త్రి ౧౦ సంవత్సరములకుఁ బైఁగా జవించి యుండెనని మీఁదఁ జెప్పియుంటిని ఈయనకు వృద్ధాప్యము వచ్చునరికి నియన పోషకులగు శ్రీ కాకర పూడి గోపాలరాయ ణింగారును, వారి సోదరులగు రామభద్రపాయకరాయణిం గారును, దరువాత రాజ్యమునకు వచ్చిన అప్పలపాయకరాయ ణింగారును గతించిరి రాణులు మాత్రము కోటలోనె నివసించు చు రాజ్యము చూచుకొనుచుండిరి పిదపఁ గొంతకాలమునకె యీసత్యవరమునాఁడు ప్రబలులై విశాలమగు రాజ్యము గలిగి చిన్న జమీందారులను దమకు సామంతులుగఁజేసి కొని మహావైభవముతోఁ బరిపాలింపుచుండిన శ్రీ విజయనగర పురాధీశులగు శ్రీ పూసపాటి మహారాజులకు స్వాధీనమైనట్లు* తెలియవచ్చుచున్నది

---

*The Rajah agreed at the time to disband his troops except certain Rajaputs who belonged to his own clan and in 1758 he was formally ordered to remove his forces and was granted a new lease at the enhanced peshkush of nine lakhs recommended by the committee his Zimindari being however increased by the addition of the Estates of Anakapalli Uratla and Satyavaram" (Chapter 11 P P 50, Vizagapatam Gazetter)

ఇంక సోమప్పశాస్త్రి గ్రంథరచన, కవిత్వము మొదలగు వానింగూర్చి కొంచెము ముచ్చటింపవలసియున్నది ఈ కవీశ్వరునింగూర్చి విశాఖపట్టణము "డిస్ట్రిక్టుమ్యాన్యువల్" అను గ్రంథమిట్లు నుడువుచున్నది

రేకపల్లిసోమప్ప — "యీజిల్లాలోనున్న అనకాపల్లి సత్యవంతుతా బాకాల పూర్వపురాజుగారి సభలో ౧౨౦ సంవత్సరములక్రిందట యీయన యుండేవారు ఈయన ప్రద్యుమ్నాభ్యుదయమను గ్రంథము చెప్పినాఁడు శ్రీకృష్ణమూర్తివారికి రుక్మిణీదేవికి కుమారుడైన ప్రద్యుమ్నుని జన్మవృత్తాంతమందులో చెప్పబడినది ప్రద్యుమ్నుఁడు మన్మథుని వకరేయని యంగరు రుక్మవతీపరిణయమనెడి నొకగ్రంథము కూడ నాయన చెప్పినాఁడు వయినచెప్పిన ప్రద్యుమ్నుడుకు రుక్మవతికి జరిగిన వివాహము కథయందులో వర్ణింపబడియున్నది" కార్మికెల్ దొరగారి యింగ్లీషుగ్రంథమునకు "విజాపురపు కోదండరామపంతులుగారి అర్థమాపు ప 133" ఇతఁడు రచించిన రుక్మవతీపరిణయమను నాంధ్రప్రబంధము నాకు సంపూర్ణముగా లభింపలేదు లభించినభాగమునుండి కవితాధోరణి తెలియుటకుఁగాను గొన్నిపద్యము లిందుఁ బొందుపఱుపఁ బడినవి

రుక్మవతిపరిణయమందలి వస్తువు రుక్మిణీసోదరుఁడగు రుక్మియొక్క పుత్రికారత్నమగు రుక్మవతిని రుక్మిణీ శ్రీకృష్ణులనందనుఁడగు ప్రద్యుమ్నునకిచ్చి, చేసినవివాహమహోత్సవకథ సోమప్ప

శాస్త్రి గొప్పపండితుఁడేగాని కవిత్వమునం దెక్కుడు ప్రజ్ఞ కలవాఁడుగాఁ గన్పట్టఁడు విశేషించి యాధునికప్రబంధకవులలో నగ్రస్థానము నధిష్ఠించిన తనప్రతిస్పర్ధి అడిదము సూరకవికి గవితావిషయమున సాటి కాజాలఁడు పాఠకమహాశయులకుఁ దారతమ్యపరిశీలనార్థ ముపయోగించు నను తలంపుతో రుక్మవతీపరిణయములోని బద్యములతోఁబాటు సూరకవికృతకవిజనరంజనమునుండిగూడ నొకేసందర్భముగల పద్యముల నిచట నుదాహరించుచున్నాను ఇంక నీరుక్మవతీపరిణయమందలి కృత్యాదిలో నొకవిశేషము గాననగును సాధారణముగాఁ దెనుఁగు కావ్యముల యవతారికలోఁ గృతికర్తలు సంస్కృతాంధ్రకవులనుమాత్రము స్తుతించుటగలదు ఈగ్రంథమునందట్టి కవిస్తుతితోఁబాటు శాస్త్రప్రవర్తకమహర్షి సంస్మరణముఁగూడ నున్నది ఇయ్యది యఖండసాహితిపరుఁడగు నీతనిశాస్త్ర పాండిత్యాభిమానమును వెల్లడించుచున్నది ఈ క్రిందిపద్యములను దిలకింపుఁడు

ఉ ఆదరమొప్ప పాణినికి నానతిచేసి తదీయశాస్త్ర మి
మ్మేదిని భాతిచెంద నెలమిన్ బ్రకటాత్మసహస్రవక్త్రి సం
వాదముచేసి వాణికనవద్యవిలాసముగల్గఁజేయు వ్యా
• త్యాదితశబ్దమంజరి పతంజలి నంజలిచేసి మ్రొక్కెదన్

1 ఆశ్వా కృత్యాది

సోమప్పకవి కవిత్వము మూఁడుపాళ్లు సంస్కృతము ఒకపాలు తెలుఁగు రుక్మవతిపరిణయములోని యీ క్రిందిపద్యము లాతని కవితాధోరణిని దెలుపఁజాలఁగలవు

పురవర్ణనాదికము

చ జలదము తత్పురికనకసౌధ సతీతిను విచ్చఁజూ చి చం
చలులని యెగవారలకచంబులతోఁ గలహించునంచు మే
డలఁ బడవైవకేరు లకటా! యనితెక్కలఁ గాలిగూర్పఁగా
దొలఁగెనునాఁగనయ్యగరుధూపముపెల్లగు జాలకంబులన్
(సోమప్పకవి)

మ అతులోత్సాహములుప్పతిల్ల నికటోద్యానంబులంబాల్పుకే
కితతుల్వోటను జిత్రనర్తనకళా కేళిన్విజృంభించు భ
వ్యతరాభ్రంకషరత్నసౌధపటలీవాతాయనవ్రాత ని
ర్గతకాలాగరుధూపధూమ్యలు మొయిల్ గానెంచియెల్లప్పుడున్
సూరకవి —(కవిజనరంజనము 1 ఆశ్వా)

ఉ అప్పురిలీలసౌధములయందు నృపాత్మజలొక్కరొక్కరున్
దప్పమటంచు నొగ్గుమనుదాఁటఁగ నొక్కనిచే కటారియా
యుప్పరివీధినున్న శశి నుక్కునఁ దాకెనో గాకయున్నఁ జె
ల్వొప్పెడిమేన మచ్చయొకటొందఁగ నేటికిఁ గల్గనేనికిన్
(సోమప్పకవి)

మ. అమరద్వీపవతీపయోవిహరణప్రాంచత్సురస్త్రీలవ
జ్రమయాభ్రంకషమంటపాగ్రముల నిచ్చల్ క్రీడఁగావించు త
ద్రమణీవారము వేర నేరుపఱుప న్నాదంచుఁగా దివ్యరా
జముఖివాళికిఁ దమ్మిమూలి యనిమేషత్వంబు గావింమటల్.

(సూరకవి)

శా. ఉద్యద్బాలదివాకరప్రతిముఁ బ్రద్యుమ్నాఖ్యుని బాలునిన్
సద్యఃకాతివిశేష జానలశిఖా సంతప్త పూర్వాంగుఁడే
తద్యోగాంతనవీనవిగ్రహుఁడు కందర్పుండు వీఁడంచు దు
ష్టోద్యోగంబున శంబరాఖ్యదనుజుం డూహించి మాయాగతిన్

(రుక్మ 2 ఆశ్వా)

స్థాలీపులాకన్యాయముగఁ గవితాశైలి పరీక్షించుట కుదాహృతపద్యములు చాలునని తలఁచి యింతటితో విరమించు చున్నాఁడను

ఇఁక మీఁదఁ జెప్పియున్న రీతిగ సత్యవరరాజ్య మంత రింపఁగా మఱి రెండుసంవత్సరములకుఁబిమ్మట ననఁగా ౧౭౭౦ సంవత్సరప్రాంతమున సోమప్పకవి సన్యసించి సిద్ధిపొందెనని తెలియుచున్నది

# 7 కొట్ర బాలకవి

## (క్రీ శ 1730—1790)

ఇతని నిజనామము వెంకటేశ్వరులు ఇతఁడు తెలుగాణ్యశాఖకుఁజెందిన వైదికబ్రాహ్మణుఁడు కౌశికగోత్రజుఁడు సోమనార్య పుత్రుఁడు నివాసస్థలము విశాఖపట్టనమండలములో రాజాముసకుదగ్గఱగానున్న యిలంనాయుఁడువలస ఈగ్రామము కొట్రవారికి శ్రీ బొబ్బిలిపురాధీశులు అగ్రహారముగ దయచేసినందున, బాలకవికిఁ బూర్వమును దరువాతనుఁగూడ నీవంశజులచ్చటనే కాపురముండియున్నారు

బాలకవి బాల్యము విద్యాభ్యాసము మొదలగువానిని గూర్చిన సమాచారమేమియుఁ దెలియరాకున్నది కొట్రవారి వంశము పండితవంశమైన కారణముచేత నీతఁడు తాతదండ్రుల యొద్ద విద్యాభ్యాస మొనర్చియుండెనని మన మూహింపవచ్చును ఈతని బిరుదనామము "బాలకవి" అనుదానినిబట్టి యీతఁడు పిన్ననాఁడే సరసమగు కవిత్వము చెప్పఁగలవాఁడై పెద్దలచే మెప్పువడసినవాఁడుగాఁ గనఁబడుచున్నాఁడు ఇతఁడు పెద్దవాఁడై ప్రౌఢకవియైనపిదపఁగూడ బాలకవినామము వీనిని విడువకుండెను

బాలకవి కాలనిర్ణయము సులభముగాఁ జేయవచ్చును. ఇతఁడు సుప్రసిద్ధాంధ్రకవిశేఖరుఁడగు నడిదము సూరకవి సమ

కాళీయుఁడును, మిత్రుఁలునైయుండెను ఈక్రింది రెండుపద్యము లును మీఁదివిషయమునకు సాక్ష్యముగుచున్నవి

బాలకవి —

కం అంతా కవులము గామా ?
అంతింతో పద్యమైన నల్లగలేమా ?
దంతివి నీతో సమమా ?
కాంతాసుమబాణ ! సూరకవి ! నెఱజాణా !

శా భద్రాజున్నిరసించి సత్కృతులు చెప్పంబూనువో మేటివై
చద్రాతింబలెనున్న వానికిని నిచ్చల్ డెల్వ బుట్టించునే
కుద్రల్ సేయని సత్యసంధుఁడని లోకుల్మెచ్చవర్తించు నీ
కొట్రా బాలకవిందు శేఖరుఁడుమాకుంబూజ్యుఁడెల్లప్పుడున్
(సూరకవి)

సూరకవి క్రీ శ 1720 సం॥ర ప్రాంతమున జననమొంది 1780 సంవత్సరప్రాంతమునఁ గీర్తిశేషుఁగమ్యెను సూరకవికంటె వయస్సునఁ జిన్నవాఁడగు బాలకవి 1730-1790 మధ్యకాలమున నుండియుండవచ్చును

బాలకవి పిత్రార్జితమగు భూవసతివలనవచ్చు నాదాయ ముచేత జవనము గడవకకాఁబోలు కవితావృత్తిచే దేశాటనము గూడఁ జేయుచుఁ గాలక్షేపము చేయుచుండెడివాఁడు కొలఁది మంది శిష్యులను వెంటఁబెట్టుకొని, పర్యటనము సలుపుచుండె డువాఁడనియు శిష్టుఁడై స్వయంపాకముచేసికొని భుజించునియు

ముగలవాఁడనియు మన మీక్రిందిపద్యమువలనఁ దెలిసికొన
వచ్చును

ఉ. చేకొని యాచకత్వమునఁ జెం సమస్తదిగంతరాళికిన్
బోకయు రాకదిరదది బుద్ధిఁ గల్గిన మోసమై స్వయం
పాకపు నిష్ఠ యుంచుఁ బ్రతిబంధకి మొక్కటిఁ దెచ్చికొంటి నే
నాఁటికోర్వ వింట కసవ స్ఫుడ శిష్యులుఁ గూడిరారు "తా
చాకలి' పూరుగాని కొసనా గంపము దోఁచ దిశ్వరా!

ఇతఁడు తన దేశాటనములో నాశుకవిత్వప్రదర్శనసామర్థ్యముచేఁ బొందిన విజయముగూర్చిన సమాచార మొకదానిలోక మిట్లు నడుపుచున్నది పాలకొండదరి వీరఘట్టమను గ్రామమునకు పద్యాశననిమిత్తమొకప్పుడు బాలకవి వెళ్లియుండెను "అక్కడ పర్వతాలు" అనుపేరుగల కోమటికవి యొకఁ డుండెను అతఁడు తనశక్తిని నెదురశక్తిని నెఱుఁగనివాఁడై తనగాలపుఁ బ్రసిద్ధకవీశ్వరులఁ గూడ ధిక్కరించుచుండువాఁడు అమాయకుఁడను వేషాంబరములు లేని శుద్ధశ్రోత్రియుఁడనగు బాలకవి పండితమ్మన్యుఁడై నీ కోమటికవి ధిక్కరింపులకు లోనై యుండెను గ్రామములోనివారు కొందఱు పర్వతాలుపక్షమునను గొందఱు బాలకవిపక్షమునను౦డి, యీకవీశ్వరద్వయమునకుఁ గవిత్వప్రదర్శనమునఁ బోటిపరీక్షఁ బెట్టిరి దైవయోగముచే నానాఁటికి బాలకవిమిత్రుఁడగు సూరకవి యాగ్రామమునకు రాఁ దటస్థించెను అంత నాకోమటికవి బాలకవిని జయించుటకన్న సూరకవిని

సాధనముగానక తన కవితయే శరణముగానుకొని వాటిపైఁ బద్య
బాణములఁ బ్రయోగింప మొదలిడినాఁడట ఆశ్చర్యము! ఆప
ద్యములు చెప్పిననాఁటనుండియుఁ గాకులు కొత్రవారి యింటి
వాకిట పెరుల మానుకొనెనఁట ఇటులనే యెలుకలరాయిడి
భరింపనోపక యెలుకలపైఁ బద్యముల సెప్పి యాబాధ నివారణ
చేసికొనెనఁట ఆపద్యముల నిటఁ బొందుపఱచుచున్నాఁడను

ఉ. నీకుటిలత్వము న్వినవనేరవు తిట్టెదఁ, దాండ్రఁడై కొనన్
రాకు, పరాకుచేనయిన రాకు, వినోదనఁ బెచ్చుకొమ్మన్న, నా
వాకులు దప్ప వారియధ్రువంబుగ నమ్మ మాంబులోన యో
కాకిమ! నీకుఁ జెప్పెదఁ బకాకొరింపకు నేఁ గవీంద్రుఁడన్

చ. ఎలుకలు పందికొక్కులును నేపున గోడల గాదెమూలలన్
కలుఁగులు వెట్టిలోఁగ నియోఁగిందులు చువ్వలుఁ గాయగూరలున్
బాలయఁగఁ దిట్టెదన్ బయికిఁ బోవక నిల్చిన జాములోపలన్
బలుకులుగావు బాలకవి వాక్కులు కర్కశబాణజాలముల్

మీఁదనుడివిన గాకమూషకముల బాధానివారణవృత్తాం
తము విస్రంభపాత్రమైనను గాకున్నను పద్యరచనాసమాచా
రము మిథ్య కానేరద కదా! ఇట్టి శక్తిసామర్థ్యముల కలిగి ప్ర
సిద్ధిగాంచిన కవివరు లనేకులు మనకుఁ గ్నాతపరిచయులే కాఁబట్టి
ఈకవివరుని కవితాప్రజ్ఞ యమోఘమై యుండిన నుండవచ్చును

బాలకవి కొన్ని శతకములును, ప్రబంధములును జెప్పె నని ప్రబలమగు వాడుక గలదు, గాని యవి యేవియు నిపుడు గానరాకున్నవి. ఇతని కృతులలో నెల్ల 'కల్యాణచరిత్రము' అను ప్రబంధము మిక్కిలి యెన్నికమైనదని చెప్పుదురుగాని యది నామమాత్రావశిష్టమైనదిగా నున్నది. కవివంశజులుకూడ నీతని కృతులను గూర్చి తగిన సమాచారము నెఱుఁగనివారై యుంట యెంతయు శోచనీయము. ఈనడుమ ననఁగా రెండుసంవత్సరములక్రిందట మామిత్రులును శ్రీ శ్రీ శ్రీ విజయనగర మహారాజావారి యాస్థానకవులు నగు మ రా భోగరాజు నారాయణమూర్తిపంతులుగారు "ఓరియంటల్" లైబ్రరీలోని యాముద్రితగ్రంథజాలముఁ బరిశీలించుచుండ నాకస్మికముగ నీబాలకవి విరచితమగు విమలాంగీపరిణయమను ప్రబంధము (రెండాశ్వాసములు మాత్రము గలది) చూచి దాని నంతయు నామూలాగ్రముగఁ జదివి ఆవిషయములను గ్రోడీకరించి యీ "కాలేజీ మాగ్జిను' లోఁ గృతివిమర్శనరూపమునఁ జిన్నవ్యాసమును వ్రాసి యాంధ్రలోకముయొక్క గృతజ్ఞతకుఁ బాత్రులైరి. శ్రీ నారాయణమూర్తిగారి వ్యాసములోని విషయములనే గొన్నిటిని గైకొని యిందు ప్రయోగించుకొనుచున్నాఁడను.

"విమలాంగీపరిణయము" శృంగారరసప్రబంధము. ఇందలికథ సాకేతపురాధీశుఁడగు మాంధాతృ చరిత్రము. ఇందుఁ బ్రథమాశ్వాసమున గ్రీష్మఋతువర్ణనము, మాంధాతృనుద్యాన

వనవిహారము, మృగయులువచ్చి ప్రభువగు నాతనికి కానుక లర్పించుట మృగశాభ మాన్పుటకుఁ దగిన పరివారముతో నారాజు హిమగిరిప్రాంతారణ్యమునకు వేటకై నాగిపోవుట, హిమగిరి వర్ణనము మొదలగునవి చెప్పఁబడినవి ద్వితీయాశ్వాసమున—మాంధాత నిండు కొలువుండుట, కుంతలదేశమునుండి చిత్రకారులు వచ్చి తమ చిత్రపటములను నతనికఁజూపుట, ఱేఁడును సన్మానించి, వారి చిత్రపటములను గొనియాడుట, పిదప నతఁడు చిత్రకారులతో మంతనముండుట, వారు తమ ఱేని యానతిపై నాతని పుత్రికై వరుని నన్వేషించునిమిత్తము వచ్చినట్లుగ రాజునకుఁ దెల్పుట, రాజకుమారికాసౌందర్యాది వర్ణనము, ఆమె చిత్రపటమును రాజు గనుఁగొని యతని చిత్రపటమును చిత్రకారుల కొసఁగుట, మాంధాత విమలాంగియందు లగ్నమానస్కుఁడై కాలము గడపుట, చిత్రకారులు మాంధాతృచిత్రపటమును దమఱేని కొసఁగుట, దాని ఱేఁడు కూతునకుఁ బంపుట, ఆమె మాంధాతయందు వలపుగొనుట, విరహావస్థాపము శిశిరోపచారములు, వనవిహారము, జలక్రీడ మొదలగునవి యభివర్ణింపఁబడినవి అనంతర కథాభాగము కొఱవడియుండుట మిగుల విచారకరమైన సంగతి ఈయసంపూర్ణగ్రంథమైనను దొరతనమువారు ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారమందు భద్రపఱచి యీకవిపేరు మాసిపోకుండఁ జేసినందులకు నెంతయు సంతోషింపవలసి యున్నది

శాలంవికి నుభయభాషలయందుం జక్కని పాండిత్యము కలదు లక్షణవిరుద్ధములగు ప్రయోగములు విరళముగాఁ గనఁబడుచున్నను, మొత్తముమీఁద నీతని కవిత్వము మృదుమధురమై కర్ణరసాయనముగా నున్నదని చెప్పవచ్చును పిన్ననాఁట నుండియుఁ గవిత్వముఁ జెప్పు సామర్థ్యము గలవాఁడగుటచే ధారాశుద్ధి చక్కగ నున్నది 18 వ శతాబ్దమున వెలువడిన పెక్కు ప్రబంధములతో "నిమలాంగీపరిణయము" అన్నివిధములఁ దులతూఁగుచున్నదని చెప్పఁగును కవితాధోరణి తెలియుటకుఁ గొన్ని పద్యము లీక్రింద నుదాహరించుచున్నాఁడను మీఁద నీయఁబడిన "చేకొని యాచకత్వమున" అను పద్యమే యీతని యనర్గళ కవితాధారను వెల్లడించుచున్నదని నాయభిప్రాయము

క. సుందర ఘృణిచందిరమణి
కందరమణినిలయ జాతికాలలితాన
త్కందర్పకబృందకరి
ట్కుందమరి చిత్రభాసి కుధరంబెక్కెన్

ఉ. బొమ్మలుదీర్చిన ట్లోలయు బొమ్మల గ్రొవ్వల మూపులంబు జా
తమ్ముల వీగనొత్తు స్ఫురితమ్ములచేఁ దలమించు కన్నులం
గమ్ము నిరాకరించు రుచిరగమ్మిన కమ్మని మేలుజాలు వా
నమ్మకచెల్ల! వీని సాటిఁ గమ్మకరాంకునకైన నున్నదే?

ఉ. అంత వసంతకాంత విపినాంతరితాంతలతాంతసంతతా
క్రాంతజనంతదంతశశికాంతినిరంతరరుజ్జ్వలాంతవి
భ్రాంతమిళిందకాంత కలరావనిశాంతనితాంతవాసవా
క్రాంతనికుంజపుంజనరకాంతము పొల్చెవసంత మంతటన్.

సీ. బాలానిలోచ్చాలి సైలాల తాపాళి
కాలోల సమదాళి లాలితములు
సురసాలవలసముత్కరిలోల శుకిశుక
స్ఫురితాలవన విభాసురతరులును
కలితసంతానాగ తులితసత్పున్నాగ
వలితక్రముకి పూగపిలసితములు
సారసక్రేంకార సారస్రవవిహార
సారసోదార కాసారతతులు

గీ. కెలియు శాలికాళి నోలి
వాంఛ మూఁడు కూన్యనకాయమాన
మాలికాలంబ నవనవమాలికాక
డంబరంచితములఁ గొల్చెఁ దద్వనములు

## 8 చాట్రాతి లక్ష్మీనరుసుకవి

(క్రీ శ 1740-1800 సం)

ఇతఁడార్వేల నియోగిబ్రాహ్మణుఁడు ఆపస్తంబసూత్ర కౌండిన్యగోత్రజుఁడు తండ్రిపేరు జగ్గయవీరరాఘవుఁడు తల్లి కనకాంబ ఇతఁడు రచించిన "విశేషాంధ్ర"మను నిఘంటువునం దిట్లు దెలిపియున్నాఁడు

క్షోణి కౌండిన్య గోత్రజగోపజగ్గ
వీరరాఘవ కనకాంబగారి సుతుఁడు
చేటరాతి లక్ష్మీనరసింహ సుకవి
చెప్పినాఁడు విశేషాంధ్ర మొప్పమీర

ఈతనిఁగూర్చి క్రీ శ "కార్మైకల్" దొరవారు తాము రచించిన విశాఖపట్టణము "డిస్ట్రిక్టుమాన్యుయల్" నందీరీతిగాఁ దెల్పియున్నారు చేట్రాతి లక్ష్మీనరుసు —

"సాంబమూర్తివారికి పార్వతికి జరిగిన వివాహమును గురించి ఈశ్వరపరిణయమని యొక గ్రంథమును, భండనారాతి ఘనకోదండరామ యనే శతకమును, విశేషాంధ్రమనే నిఘంటువును చెప్పినాఁడు"

(డిస్ట్రిక్టుమాన్యుయల్ నకుఁ దెలుఁగుతర్జుమాపుట 134)

మీఁదఁ జెప్పఁబడిన గ్రంథములలో నొకటియగు "ఈశ్వరపరిణయము" ఎచ్చటను దొరకలేదు నామమాత్రా

విశిష్టమైనదిగాఁ గనఁబడుచున్నది. మిగిలిన రెండుగ్రంథములను సముద్రితములైనను జేకూరుచున్నవి "భండనారాతి భీమ శతకము"లోని 12,13, పద్యములు కొంతకాలముక్రిందట శ్రీ బ్రౌనుదొరగారు సంపాదించి ముద్రించియున్నారని తెలియవచ్చుచున్నది. ఈశతకము అడిదము సూరకవి విరచితమగు రామలింగేశశతకమును, గోగులపాటి కూర్మనాథకవివిరచితమగు శ్రీవరాహలక్ష్మీనృసింహశతకమును జాలవరకు ననుకరించియున్నది. రామలింగేశశతకమువలె నిదికూడ నిందాగర్భకావ్యము (Satire) శతకముయొక్క కవితాశైలి మృదుమధురమై నీతిబోధకముగా నున్నది. దీనిలోని మొదటిపద్యమును కూర్మనాథకవి నరసింహశతకములోని మొదటిపద్యమును కూర్పునందొకే మాదిరిగానున్నవి. పాఠకమహాశయులు గమనింతురుగాక!

సీ. శ్రీమద్ధరిత్రీ భవామాధురిమ్మగు
    వాక్సుధాపానశ్రవణ పరాకు
కౌశికయజ్ఞ శిక్షణదక్ష! రక్షోవి
    ఘాతకార్ముక శరకరపరాకు
క్షత్రియకోటి భక్షణవిచక్షణపర
    శ్వధధారి భంగధూర్వహపరాకు
దండకావన సముద్దండ చండపలాశ
    ఖండనకాండ ప్రకరపరాకు

తే. పాదభక్తి జనస్వాస్థ్య ! బాధఁబాపుమి
నప్పు డూరకయుంట న్యాయమగునె? నను
నీవుకనుపించు కొని దిక్కెపిఁభా
భండనారాతిభీమ ! కోదండరామ

సీ. శ్రీమద్రమారమణీమనో రమణీయ
సగుణ విఖ్యాతబంధుర ! పరాకు
శంఖచక్రగదాసి శార్ఙ్గచాపాదిభా
సురదివ్యసాధనకర ! పరాకు
ప్రహ్లాదనారద వ్యాసశుకాదిక
భక్తసంరక్షణ ! బహుపరాకు
బహుతర బ్రహ్మాండ భాండపరంపరా
భరణలీలాధురంధర ! పరాకు

గీ. నీకుసాష్టాంగ వినతు లనేకగతులఁ
జేసి విన్నపమొనరింతుఁ జిత్తగింపు
చెనఁటి పీడని మదిలోన నుకమాను
వైరిహరిరంహ ! సింహాద్రి నారసింహ !

ఈరీతిగ ననుకరించుట శతకమునందు మఱికొన్ని పద్యములపట్లఁ గూడఁ జూపట్టుచున్నది

సీ. మకరాక్షుగళము ద్రుంపకగాని పొదిలోకి
రానిబాణము వాడి బూనదొక్కొ?
కుంభకర్ణుశిరంబుఁ గూల్పకమఱ్ల ని
నారాచమునఁదుష్టు నాటెనొక్కొ?

కుంభ నికుంభ విజృంభత్వమణఁక
ప్రాణిశరము మొక్కవోయెనో కో- ?
సర్వరోమపలాశుఁ జంపకతిరుగని
యాశుగమణి వ్యర్థమయ్యెనో కో- ?

గీ. అట్టిసాధనములు నేఁటికట్టెయున్నఁ
ఏమకుఁ దాపె బయల్వడ ధర్మమార్గ
రోధితల ఁబల్చి ఎతూశిలోకిరావె ?
భండనారాతి ! ఁమ ! కోదండరామ

సీ. మున్నుతాటకి ప్రాణములఁగొన్న బాణంబు
మెఱసె సుబాహుమన్నినవిశిఖము
మించి విరాధు ఖండించిన ప్రదరంబు
ఖరదూషణాది సంహారణశరము
మాయలమారిమ మదమణంచి పూపు
ఘోరకబంధునిఁ గూల్చువెలుఁగు
వాలిని బలశాలిఁ గూలనేసినకోల
జలధినింకించిన సాయకంబు

తే. రావణాది మహాసురరాజననణఁచు
చండకాండంబు లేమాయె ? చటులభువన
ఖండనముసేయ నయ్యంబకములఁ బఱపు
వైరిహరరంహా ! సింహాద్రినారసింహా !

ఇంక నన్యాపదేశముగాఁ జెప్పిన పద్యములందును, నీతిప్రబోధకపద్యములయందును రామలింగేశశతకములోని పద్యములకు ఛాయగాఁ గొన్నిపద్యములిందుఁ గానవచ్చుచున్నవి ఉదాహరణముకై 1 2, పద్యముల నీక్రిందఁ జూపుపఱచుచున్నాఁడను

సీ. పాలభాండము పిల్లి పడఁద్రోయఁగానేర్చు
నొలికినపాలెత్తనోర్వఁ గలదె ?
పూచినవృక్షంబు పురుగంటఁగానేర్చు
చిగురూనిపి శాఖచేయఁ గలదె ?
పూర్ణతటాకంబు బొరియవెట్టఁగనేర్చు
నెంట్రికకలమపోయింపఁ గలదె
గోపురూర్ధంబు ముక్కున గొల్వఁగానేర్చు
మాలకాకము పుంగు మాన్పఁగలదె ?
గీ. అగ్రహారము పాతసేయందలంచు
పాపకర్ముఁడది మరల్పంగఁ గలఁడె ?
దీనులను బ్రోచుటకు నీవు దిక్కుగాక
భండనారాతిభీమ ! కోదండరామ !
సీ. సారమేయంబు బిట్టిచేరు ద్రెంచునుగాని
పడకుండఁ బట్టునే ? పాలకుండ
కోతికొబ్బరికాయ కొనకెక్కి పడఁద్రోయుఁ
గాని లోనిజలంబు నానఁగలదె?

ముగ సలిపెండ్లాడి ముదిత కూావనము వ్య
ర్థముసేయుఁ గాకెమిదానఁ గాంచు ?
కాకి ముంగిర నోటఁ గెఱవి డొంకలపాలు
కావింపఁ గాకెమిగాంచు ? దాన

గీ చెలఁగుసరుఁ దొరు సంపడ చెఱచుఁగాని
తనకునేమి ఫలింపను తథ్యమరయ
నిందమాత్రము వ నెకి నిలుచుజగతి
రామలింగేశ ! రామచంద్రపురవాస !

ఇట్లు పరిశీలించిచూడ ( పెక్కుపద్యములు చాయగా నున్నవి చిక్కఁగలవు మఱియు విశేషము సూరకవి "ఆంధ్ర నామశేషము" తుదిపద్యమును నింత్యనరపు "విశేషాంధ్రము' తుదిపద్యమును నొకేమాదిరిగానున్నవి చిత్తగింపుఁడు —

కం తెలుఁగుంగబ్బపు మర్మము
తెలుఁగుకవీంద్రులకుఁ దేటతెల్లమి గాఁగన్
తెలియఁగనడిదము సూరన
చెలువారఁగ నాంధ్రనామశేషముఁ జెప్పెన్

కం వరచేట రాతిలక్ష్మ
నరుసు విశేషాంధ్రమనెడు నామంబిడి పె
న్వేరవున నాంధ్రపదంబులు
నెరవుగసంధించి చెప్పె నిపుణులు మెచ్చన్

ఇట్లు మీఁదఁజూపఁబడిన ననుకరణములఁబట్టి లక్ష్మణ రుసుకవికి సూరనకూర్మనాథుల కవితయెడలఁగల గౌరవము తేట

ర్జెల్లమగుచున్నది ఈముగ్గురు కవులును నించుమించుగా నొకే కాలమునందున్నవారు 1794 సంవత్సరమున జరిగినపద్మనాభయుద్ధము తరువాతఁ గొంతకాలమీ లక్ష్మీనరసుకవి జీవించియున్నట్లుగా జనశ్రుతిగలదు దీనిని బట్టియాలోచింపఁగా సూరనకూర్మనాథులకంటె నితఁడు వయసునఁ జిన్నవాఁడై యుండవచ్చును

శ్రీవిజయనగర ప్రభువులచేఁ బోషింపఁ బడిన కవిపండితవంశములలో నీచాట్రాతివారి కుటుంబముగాడఁ జాలప్రసిద్ధిఁ జెందినది ఈకుటుంబమువారు కవిత్వముగందేకాక "ఆగమశాస్త్ర"మందుఁగూడ నధికప్రజ్ఞకలవారనియు లోకవాడుకకలదు ఈకుటుంబమువారికి "పెడకి" అను గ్రామము (చీపురుపల్లి తాలూకాలోనున్నది) ఇనాముగా శ్రీవిజయనగర ప్రభువులు దయచేసియున్నారు నేఁటికిని నామాన్యముల నీవంశమువారనుభవించుచున్నారు

అడిదము సూరకవి గోగులపాటి కూర్మనాథుఁడునను నిరువురకు నీతఁడు సమకాలీనుఁడై వయసున వారికంటెఁ జిన్నవాఁడైన కారణమున నితనికాలము 1740-1800 మధ్యకాలమై యుండునని యూహింపవచ్చును కవితాధోరణి తెలియుటకు భండనారాతి భీమశతకములోని మఱికొన్ని పద్యము లీక్రిందఁ బొందుపఱుపఁ బడినవి —

సీ ॥ వెనువెంటఁదిరిగితే విటకానితోఁ జెప్పి
సమకూర్చుఁ గార్యంబుసానిదైన

మచ్చికఁజేసితే వచ్చి పైఁబ్రాంగిను
కూపెపోఁగోఱచు కుక్కలైన
నలవాటుఁజేసితే యుంగుంటిముల్లు
రక్షసేయును పాదరక్షలైన
నీవాఁడననుకొన్న నెలనెలపనిఁజేసి
మానిపోవునుడబ్బు మంగలైన

గీ. అంతకన్నను తక్కువైనల్లుదోఁచె
నచుసరిం విసనాఁరఁ గాయంగ లేకి
యందలంబెక్కి తిరిగితే యతిశయుంబె ?
భండనారాతిభీమ ! కోదండరామ !

సీ. భాగ్యవంతునియిల్లు పాడుగాఁ జేయంగఁ
బరదారగమన పాపంబెచాలు
సొమ్మున్నవానిల్లు సూరపుచ్చంగను
గొప్పవడ్డీకినిచ్చు తప్పెచాలు
నుద్యోగియిల్లు సద్యోహానిసేయంగ
విపకుండ దొరసొమ్ముఁ దినుటెచాలు
కోమటియిల్లు సంకుచితంబుసేయ బ్ర
హ్మస్వముఁదిన్న ద్రోహంబెచాలు

గీ. నెంతసామంతుఁడైన వానిల్లుచెఱచును
పేదబ్రాహ్మణులను బాధపెట్టెనేని
కారడవిదైన వహ్నిచేఁ గాలకున్నె
భండనారాతిభీమ ! కోదండరామ !

# 9 వడ్డిపర్తి కోనరాట్కవి

(క్రీ శ 1754—1834 సం)

ఇతఁడార్వేల నియోగిబ్రాహ్మణుఁడు ఆపస్తంభసూత్ర శ్రీవత్సగోత్రుఁడు రామరాజ పౌత్రుఁడు వేంకట తమ్మయా మాత్యుని పుత్రుఁడు తల్లిపేరు రామాంబ వీని యగ్రసోదరులు సర్వయ్య, వేంకటేశ్వరులు అనువారలు కాపురము విశాఖపట్టణమండలములోని "సర్వసిద్ధి" యను గ్రామము

ఆ ఊరు సర్వసిద్ధి పేరు కోనమరాజు
వడ్డిపర్తివారు వాస్తవంబు
బ్రాహ్మణుండ నేను బ్రాబంధికుండనఁ
బరగువాఁడ ధాత్రినెఱుఁగువాఁడ

కోనరాజుకవి బాల్యము, విద్యాభ్యాసము మొదలగు వాటినిగూర్చి, యేమియుఁ దెలియరాకున్నది విద్యాబుద్ధులు నేర్చి పెరిఁగి పెద్దవాఁడైనపిదపఁ గులక్రమాగతముగ వచ్చు కరిణీకముఁ జేకొని, పిత్ర్యమగు మూఁడువందల యెంకరముల పరిమితిగల సౌఖరి యినాంభూములవలన వచ్చు నాదాయము చే సుఖముగ జీవయాత్ర గడిపిన ధన్యుఁడు సాధారణముగా నాంధ్రకవిశ్వరులఁ బెట్టపట్టిన దరిద్రతాదేవతయొక్క కటాక్ష వీక్షములకుఁ గొంతదూరముగఁ దొలఁగినవాఁడగుటచేతనే కవి తావృత్తి జీవనాధారముగఁ జేసికొనవలసిన నగత్యము లేనివాఁడై

కాలము గడిపెను గ్రామాధికారిగానుండియుఁ గవిత్వకళయం దధికాదరము కలవాఁడై, కృషి చేసి, సరసకవిత్వవైభవములను జూపు ప్రబంధరత్నములఁ గావించి, కీర్తికాయుఁడయ్యెను ఆర్వేలనియోగులగు కుందూరివారి వంశములోని యొకకవి చెప్పిన జమాబందీదండకమువంటి యొక సీసమాలికనె "కమిటీ యుత్తర' మనుపేరు నీకవి స్నా॥ 1203 ఫసలీలో జరిగిన యినాం భూముల ఫైసలాదుసంబంధంబగు జమాబందీనిగూర్చియు, నాఁటికాలమున మిరాశీదారులు పడిన ప్రయాసకష్టములఁ గూర్చియుఁ జెప్పి దానిని జమాబందిసాగించు దొరవారికి వినిపించి తనతోఁబాటు తన మిత్రులగు నితర కరణముల కష్టములఁ దొలఁగించెనని చెప్పుదురు ఆసీసమాలిక యిచటఁ బొందుపఱుపఁబడినది

## కమిటీ వుత్తరం

సీసమాలిక —

బారాస్నసాలవ ఫసలినియాదాస్తు
పంగన్ వుప్పలం పక్కినాఁడ
ఫివిరెవరను తేది భిన్నవో రోజ్నరికి
కరణాల సోగట్ల కరుణావినుడి
యేమయా! తాతగారూ! మీదు క్షేమమా
మామయ్యగారూ నమస్కృతంబు

చెరువులునూతులు తరువులుగములెన్ని?
ఇళ్లువైనంబు పెరళ్లు కణి
సగ్రామమునకు విశ్వావసాబ్దములగా
యతుసౌమ్యవరకు ఆగతము ఏకటి
సాధారణాది పరిధావివరకు పం
డినపంట రాబడివెచుకరెంగు
దగ్రపమాదీచమొదల్ కాఁయుక్తి సం
వత్సరంబుకు తుదవచ్చుఘనము
మూఁడ ముద్దర్తులు మూటికయేకట్ట
దినకకుళ్లుధ్వాది దినసుమెట్లు
ఝూడాదగోబస్తు సనధిలరా డి
పంటమిరాసీల పంటరుసుము
చాకర్ల పంటయు సకలమురాబడి
గాముగానావసూల్ కట్టుబళ్లు
పోతులుగిదెలు పొన్నారునాగళ్లు
యెద్దులమందలు యెనగపెద్ద
నాయలవైనము పాయ కారిమొదల్
మేకలుగొఱ్ఱల నేకమైన
పూర్వపుమాన్యముల్ తరువాతమాన్యముల్
కొన్నభూములుప్రతి గొన్నయట్టి
ఫీరస్తుకల్గిన పారమాశీఖత్తు
యిస్టెమెంటుకాగిత మిచ్చినార

కరువులో గడికి లెఖ్కలుబో యెమూవద్ద
కరువులో లెక్కలు గానరావు
రెండేళ్ల లెఖ్కలు లెవ్వనాదగ్గిఱ
మూడేళ్ల లెఖ్కలు బోయెమాకు
నాలుగెళ్ల విజూడ నాదగ్గిఱను లేవు
కడగిలయిడెన్లు కాకరము లేదు
పద నాలుగెళ్లకు పదపరుచున్నారు
యింకాపదెళ్లకు యిస్తునేను
ఝామున్రపొద్దెక్కెను శాలికు డాకచే
రీకివస్తున్నావ లేక మాను
తున్నావొ జెప్పుము తుప్పుజుల్మానాకు
కాసుకుగతిలేదు కాపులివరు
ఇదిగొవస్తినటంచు అదిగొవస్తినటంచు
చంకలెఖ్కగదించి సరవినేగి
యీపంచగూర్చుండ నాపంచగూర్చుండ
నంతలోపల రవియస్తమింప
చిరచిర లేచి ముందరసాగువారల
గూడిడేరావేరి కొంతచేపు
తాటియాకులువిప్పి తారుమారులుచేసి
దీపాలముందర తిరగవేసి

గీ. ఆరుపే [illegible]
గాన [illegible] కల [illegible] రుణ జెసి
శెలవు వెగింబోసంగవె సారనాక్షు
విమతగౌరీశ కృపమాకి వెంకటేశ

N. B.—ఈమాటలు కేవలము వినోదార్థము వ్రాసిన కారణమున కోనరాజు [illegible] ఛందోవ్యాకరణాలను [illegible] దగియున్నది ఆకారణముచేతనే [illegible] మదా [illegible] ముగాఁ బ్రకటించితిని

అ. రా.

కోనకవి క్రీ. శ. 1754 సంవత్సరములోఁ బుట్టి 80 సంవత్సరములు జీవించి, 1834 సంవత్సరములో స్వర్గస్థుఁడయ్యెను ఈకవివరుఁడు తనకవితాశక్తిచే నద్భుతకార్యము లొనర్చెనని యొక ప్రసిద్ధిగలదు దానిని స్థిరపఱచు సమాచారమొకటి నిత నిర్మితియగు "మహాలక్ష్మీ పరిణయము" పీఠికలో నీకవిమనుమలును, ఏతద్గ్రంథప్రకాశకులును నగు శ్రీయుత వీరరాఘవస్వామి పంతులుగారు నుడివియున్నారు ఆసమాచారమునే యిచట సంగ్రహముగాఁ జెప్పుచున్నాఁడను కోనరాజుకవి యొకప్పుడు కొంతపరివారముతో శ్రీజగన్నాథము యాత్రార్థమై వెళ్లియుండెను అప్పుఁడవి రథోత్సవదినములు సుంకము చెల్లించినగాని శ్రీస్వామివారి దర్శనము లభ్యముకాకుండెను అట్టిసుంకముఁ జెల్లింపనిష్టములేనివాఁడై, యతఁడీరీతిని స్వామివారిని స్తుతించుచుఁ బద్యములను జెప్పెను

సీ మాణిక్యపురపురో మార్గమంచుమన్నాను
గుండలిశయన యటుం ౨, పోకు !
ఘాటాలనరసింహ పూటమధ్యావని
మండలందున్నానటుం ఖ, పోకు !
నరసింహలోకాధి నానాథ్యమధ్యస్థ
లోర్వియందున్నా నటుం ను, పోకు!
నిజపురింద్రద్యుమ్న నిలయభూతలమునం
దున్నాను వడియటుంకుండు, పోదు !
తే గీ పోకుపోకు జగన్నాధ పుణ్యమూర్తి
దితిసుత విపక్ష ! త్రైలోక్య దీనరక్ష !
పతితపావనబిరుదాంక ! బహుపరాకు
సేవకునిఁ బ్రోవుదయఁజూడు చిత్తగింపు

ఇట్లు కొన్ని పద్యములు చెప్పునరికి నట్టికవితాప్రభావము గారవించి భక్తునిపై స్వామికిరుణ జూపెనో యన, రథమెంత మందిలాగి శ్రమపడుచున్నను గదలక నిలివిపోయెను. అంతఁ గర్ణాకర్ణిక నీకవిప్రభావము మహంతిమొదలగువారువిని, సుంక ముగైకొనకయే యాతని నాతనిపరిజనమును శ్రీస్వామివారి దర్శనముచేయ ననుమతించిరి

గీ జగతి నాలుగువర్ణముల్ సమముచేసె
కుడువఁజెసితివౌభళ్లే! కుడుచువే ౹
నేహ్యమిసుమంతయును లేక సహ్యముగను
శ్రీజగన్నాథ! చేసితే చిత్రముగను

అనిచెప్పఁగా రథము యెప్పటియట్ల కదలినడచెనని చెప్పు చున్నారు

గ్రంథరచనావిషయము —కోనరాట్కవి వేంకటేశ్వరో పాఖ్యానము, రేవతీపరిణయము, శ్రీమహాలక్ష్మీపరిణయము, జానకీరామశతకము మొదలగుకృతులను రచించెను ఈవిష యము శ్రీమహాలక్ష్మీపరిణయమందిట్లు చెప్పఁబడియున్నది

ఉ ఆమహాత్మాన్వయంబున గమాఘపభక్తి జగించి హా క
రామకృతుల్ రచించితని, రైవతిపుత్రి వివాహకావ్యమున్
గామితమొప్ప వెంకటనగప్రభు దివ్యచరిత్ర మాసుధా
ధామదివాకరంబుగను ధన్యుఁడ నీధరణీతలంబునన్

మీఁది మూఁడుప్రబంధములలో నొకటియగు శ్రీమ హాలక్ష్మీపరిణయము, ముద్రితమై కతిపయదినములనుండి ప్రచా రములోనికి వచ్చియున్నది ఇది యైదాశ్వాసముల శృంగారరస ప్రబంధము ఇందలికథ శ్రీలక్ష్మీనారాయణుల వివాహమ హోత్సవము ఇది పద్మపురాణప్రసిద్ధమని కవి యిట్లు మనకుఁ దెలిపియున్నాఁడు —

"కైలాసమందు శంకరుఁడద్రికన్యకు
బోధసేయు పురాణగాథలందు
రాశించుపద్మపురాణోక్త కథలలో
నంబుజాలయ వివాహప్రబంధ

మాంధ్రభాషఁ రచించి యస్మత్కులాభీష్ట
దైవమా నరసింహ దేవునకును
కృతిసమర్పించు

కోనరాట్కవి నిరుపమానసాహితీపటిమయు ననర్గళకవితాధారయుఁ గలవాఁడని యీకృతియే ఘంటాపథముగఁ జెప్పుచున్నది. కవిత్వము మూఁడుపాళ్లు సంస్కృతము నొకపాలు తెలుఁగుగలిగి కర్ణపేయమై యొప్పుచుండును. వ్యాకరణవిరుద్ధములగు ప్రయోగములు విరళముగాఁ గాఁబడుచున్నను, నవి గణింపఁదగినవి కావు. అట్టివైనను లీతనిసుధామాధురివార్ధిలో మాటుమాయమగుచున్నవి. మొత్తముమీఁద నీమహాలక్ష్మీపరిణయమును 18,19 శతాబ్దములలో వెలువడిన ప్రబంధములలోఁ బ్రసిద్ధివడసియున్నవానిలోఁ జేర్చి, యున్నతస్థాన మీయఁదగునని చెప్పవచ్చును

కవి యీగ్రంథమును శ్రీసింహాచలనరసింహస్వామికి నంకితమొనర్చెను. ఇతనిఁ గూర్చి తెలియుటకుఁ గవికృతములగు గ్రంథములనుండి కొన్ని పద్యముల నిందుఁ బొందుపఱచుచున్నాఁడను

మ. క్షితి నార్వేలనియోగిపుంగవులలో శ్రీవత్సగోత్రోద్భవుల్
చతురోపాయసమర్థవైభవకళాచాతుర్యవంతుల్ దగ
ద్దిపర్తికళానిధుల్ సుగుణసందీప్తప్రభావోన్నతుల్
మతిమంతుల్ హితకార్యవంతులు మహామంత్రీశ్వరగ్రామణుల్

ఉ బంగరుమేడలం జలజపాళులు వీణలఁ గేలఁబూని సా
రంగసమాఖ్యరాగ మలరంబలికించినఁ జెరనిల్చు నో
జంగొమరారె విద్రుమనిశాకరకాంతధగద్ధగప్రభా
భంగవిశాలసాల ఘనబందుర చిత్రకురంగజాలముల్

ఈపద్యమునుబట్టి కవికి సంగీతమందుఁగూడ నభినివేశము గలదని యూహింపవచ్చును

చ మలదొరముద్దుపట్టిమెడమంగళసూత్రము కంప మొంద ను
జ్జ్వలసురవాహినీమణికి సాగదు చంచజ్జీవనంబు నె
న్నడఁదడబా టొకింతయుఁ గనంబడ దవ్వెలిగుబ్బ తెనికిన్
హాలహాల మొక్క సారె గగనాంబరుఁడా నెరు వేరఁజూడఁగన్

కవి యీపద్యమునందు 'ల" "డ" లకుఁ బ్రాసమున మైత్రిఁ గూర్చినాఁడు

కం పలుకులు కపురపు మొలకలు
వలపులు క్షణభంగురములు వావులుసున్నల్
నిలుకడలు నీటిబుగ్గలు
అలివేణుల నమ్మఁజూడ రార్యులు జగతిన్ (3 ఆశ్వా)

మ వరుఁడన్నన్ ధనమన్న సత్యమనిన న్వాత్సల్యమన్నన్ మహో
హరుఁడన్న న్బరమార్థమన్న సుకృతంబన్నన్ తపంబన్న స
ద్గురువన్నన్ వ్రతమన్నఁ గోరికనసంతోషంబనన్ జీవితే
శ్వరుఁ డన్నన్ విభుఁడన్న నికునబలా వైకుంఠుఁడొల్లప్పుడున్
(5 ఆశ్వా)

చ సమయమెఱింగి యవ్విభుని సన్నిధికేఁగి తదీయదివ్య చి
త్తము తెఱఁగెల్లఁ గాంచి వనితామణుల న్వెలయించువేళ, క
య్యమునకుదూఁకువేళ మృగయారతినొందెడువేళ కోపభా
వము గనువేళ మాని, మృదుభాషలవిన్నపమాచరింపుమీ.

(వేంకటేశ్వరోపాఖ్యానము)



# నదిమింటి రామయోగికవి

(క్రీ॥ శ॥ 1770—1840 సం॥)

ఈతఁడు వేఁగినాటివైదికబ్రాహ్మణుఁడు కౌండిన్యగోత్రజుఁడు ఈశ్వరప్పశాస్త్రి పౌత్రుఁడు లక్ష్మీనరసింహశాస్త్రి పుత్రుఁడు జన్మస్థలము గోదావరిమండలములోని క్రొత్తలంక ఈతని శైశవమునందే తలిదండ్రులు స్వర్గస్థులుకాఁగా నీతని పెదతండ్రిగారితనిఁ జేరదీసి పెంచుచు వచ్చిరి ఇట్లుండఁగాఁ గొన్నినాళ్ళకినఁగా రామయోగి 7 8 సంవత్సరముల ప్రాయముగలవాఁడై యుండఁగా గోదావరిమండలములో దుర్భిక్షము కలిగెను ఆహారబాధ సహింపలేకను, స్వగ్రామమున స్థిరమగు జీవనోపాధి వేఱొండు లేకుండుటచేతను, నీతని పెదతండ్రిగారు కుటుంబముతో విజయనగరము చేరుకొని, యెట్లో జీవయాత్ర గడుపుచు వచ్చిరి ఈకుటుంబమువారు క్రొత్తలంకనుండి యీవైపునకు వచ్చినవారగుటచేతనే వీరికి "కొత్తలంక నదిమింటివారని" పేరు వచ్చినది

ఇట్లీకుటుంబమువారు విజయనగరమునఁ గాలక్షేపము చేయుచుండ దైవయోగముచే బాలుఁడగు రామయోగి, యాకాలమున శ్రీ విజయనగరసంస్థానమును బాలించుచున్న శ్రీ పూసపాటి చిన విజయరామరాజులుంగారి దర్శనముచేయఁ గోటలోనికిఁబోయెను దైవానుకూల్యమునకుఁ దగినట్టుగా నానాఁడు 'పహరా'ల యాటంకములేకయే యీబాలుఁడు మహా

రాజసన్నిధికిఁ బోవగలిగెను అంత దయాస్వరూపుఁడగు నా రాజచంద్రుఁడు కట్టివాని వృత్తాంతము దెలిసికొనఁ గుతూహ లియై బాలుని కొన్నిప్రశ్న లడిగెను ఆప్రశ్నలకుఁ బ్రత్యుత్తర ముగ మహాప్రభూ! "యెదురులేని యంబలిత్రాగుచున్న యీ జోగిని శ్రీవారు పోషించి రక్షింపవలె"నని వేఁడుకొనుటకై యేలి నవారిదర్శనమునకు వచ్చితినని చెప్పెను అంత నా మహా రా జాబాలునిమాటలోని "ఎదురులేనియంబలి"యనుదాని య భిప్రాయముదెలియఁగోరి, తమసన్నిధినున్న చట్టి సత్యప్పగారి నడుగఁగా "మహాప్రభూ యీపేదబాలుఁడు తాను త్రాగు చున్న యంబటిలోనికి నూకలనుగూడ సంపాదించుకోలేనంత దిక్కుఁడై యున్నా"ఁడని చెప్పెను

పిదప మహారాజు రామయోగి కుటుంబసమాచారము ను సావధానుఁడై విని, కరుణించి యాబాలునకు తమఖాసా ఖందాలో ముమ్మారును భోజనసదుపాయమును జేయుటయే గాక యాతని పెదతండ్రిగారి కుటుంబమునకుఁ బుష్కలముగా జీవనోపాధిగల్పించి, సంరక్షించుచు వచ్చెను ప్రప్రథమమునఁ గవికిఁ గల'జోగి'యను పేరునకు మహారాజావారే రామశబ్ద ము నుజేర్చి, నూతననామకరణముగావించి, శ్రీవారి జనానామం దిరములోఁగూడ నీబాలుఁడు నిరాతంకముగాఁ దిరుగునంతటి చనువునిచ్చి పుత్రప్రేమతో సంరక్షించుచు వచ్చిరి ఇట్లు మహా రాజ్ఞీమహారాజులకటాక్షమునకుఁ బాత్రుఁడై వారి యాస్థాన

పండితులయొద్ద విద్యగఱచుచు నచిరకాలములోనే తనప్రతిభచే నుభయభాషలయందు నఖండపాండిత్యము సంపాదించి, రెండిటియందును సరసమగు కవిత్వము చెప్పఁగలవాఁడై వన్నెకెక్కెను ఆవాఁడు శ్రీమహారాజావారి యాస్థానములోనున్న సాహిత్యచక్రవర్తి పూజారి తమ్మన్నగారియొక్కయు, చల్లా సుబ్బరాయశాస్త్రి ప్రముఖపండితులయొక్కయు, గణనకుఁ బాత్రుఁడై విష్ణలరాయఁడు మొదలగు పండితకవులకు మిత్రుఁడై యశస్సు నార్జించెను

రామయోగికవి శ్రీ విజయరామమహారాజావారి కాలమున విద్యాసంపాదనముగావించుకొని, శ్రీ నారాయణగజపతి మహారాజావారి కాలములో వన్నెకెక్కిన పండితుఁడై తన నిరుపమానప్రతిభచేతను, కవితాసామర్థ్యముచేతను, పేరుగాంచి యారాజచంద్రని ధర్మపత్నియగు శ్రీకొండయాంబామహారాజ్ఞికి సంస్కృతవిద్యాగురువై ప్రకాశించెను.

ఇట్లు కొంతకాలముజరుగ శ్రీ నారాయణగజపతిమహారాజులుంగారు విజయనగరమునువీడి, కాశీనివాసమేర్పఱచుకొని, సకుటుంబముగ నచ్చటికి విచ్చేసిరి శ్రీవారి యాశ్రితుఁడగు రామయోగికవి గృహసంబంధమగు కొన్నిచిక్కులచేఁ దనపోషకులగు మహారాజావారితోఁగూడ వారణాసికిఁ బోలేకపోయెను కాని తరువాత చాలకాలమువఱకు విజయనగరమున నుండలేదు ఇంతలో కొంకాడవాస్తవ్యులును (ఈగ్రామము, విజయ

నగరమునకుఁ దూర్పుగా 5 మైళ్లదూరములో నున్నది) మొఖా సాదారులును శ్రీ విజయనగరమహారాజావంశమునకు జ్ఞాతివర్గములోఁ జేరినవారును నగు శ్రీ పూసపాటి కొండరాజుగారి యాశ్రయమును బొంది, యీతఁ డావితరణశీలునకు సంస్కృత విద్యాగురుఁడై తనజీవితశేషము నాగ్రామమునందే గడపెను ఈయంశ మీక్రిందిపద్యము స్పష్టపఱుపఁగలదు దీనిని రామయోగికవి తనయవసానకాలమునఁ జెప్పెనని వాడుక

కం. సెలవా దివికేగుటకు
జ్వలకీర్తి మహాప్రతాప! సౌజన్య కలా
కలన! మిముచాలకాలము
కొలిచితిఁగద పూసపాటి కొండనృపాలా!

శ్రీ విజయనగర పురాధీశులగు శ్రీ చిన విజయరామరాజు మహారాజావారికిని, వారిపుత్రులగు శ్రీ నారాయణగజపతి మహారాజావారికిని నీకవి యాశ్రితుఁడైన కారణముచే నితని కాలము క్రీ శ 1770-1840 మధ్యకాలమై యుండుననుటకుఁ బ్రతిబంధకము కానరాదు ఇంక నీరామయోగికవి పౌత్రులును ప్రకృతమున శ్రీవిజయనగరమహారాజావారి యాస్థాన పండితులును, పురోహితులును, ఈ వ్యాసమునకు వలయు తమకుటుంబచారిత్రక విషయములఁ గొన్నింటిని నాకుఁ దయతోఁ దెలిపినవారును నగు బ్రహ్మశ్రీ రామజోగి శాస్త్రులుగారు సజీవులై యున్నారు వీరి వయస్సిప్పుడు 83 సంవత్సరములు.

ఈయన పుట్టుకకు రెండుసంవత్సరములముందు రామయోగికవి స్వర్గస్థుఁడయ్యెనట దీనినిబట్టి పరిశీలించినను గవి కాలము 1770-1840 సంవత్సరముల మధ్యకాలమునకు సరిపోవుచున్నది

'రామయోగి' గొప్పపండితుఁడనియు, కవియనియు, మంచిప్రసిద్ధిగలదు కాని వానికవితాసామర్థ్యమును పాండిత్యమును వెల్లడించు నుద్గ్రంథము లేవియుఁ గానరావు రెండు చిన్న పుస్తకములుమాత్రము ముద్రింపఁబడి ప్రచారములో నున్నవి వానిలో నొకటి "భళ్ళాణ దండకము" రెండవది "బాణాసుర యుద్ధము" (పదము)

భళ్ళాణ దండకము — ఇందు శివభక్తాగ్రేసరుఁడగు భళ్ళానరాయని చరిత్రము వర్ణింపఁబడినది సింధు కటక నగరాధీశుండగు నీభళ్ళానరాయుని వితరణాది సద్గుణంబులఁ బరిక్షింప నెంచిన మాయావిటస్వరూపుఁడగు శంకరుని కీరాజు తనకాంతను వారకాంతగా సమర్పించి, తనదగు "ఇష్టదానవ్రతము"ను జయప్రదముగ నిర్వహించి శివునిమెప్పుగాంచి, భార్యలిరువురను వెంటనిడికొని బొందెతోఁ గైలాసమును జేరిన కథను గవి మిగుల రమ్యముగాఁ జెప్పినాఁడు కవికిఁగల యుభయభాషాపాండిత్యమును వ్యక్తపఱచుటకే యీదండకము వ్రాసినట్టుగ నీక్రింది పద్యమువలనఁ దెలియుచున్నది —

ఉ రాణఁదలిర్పఁ జెప్పి రఘురాముని కంకితమిచ్చినాఁడ "భ-
ళ్ళాణచరిత్ర" దండక మలక్ష్యము సేయఁగఁబోక యాంధ్రగీ

ర్వాణరసజ్ఞులైన కవివల్లభులారం బరీక్షసేయుఁడ
క్షుణ్ణపదార్థ గర్భరసపద్ధ మదీయకవిత్వతత్త్వమున్

ఈకవి 'యక్షుణ్ణపదార్థగర్భరసపద్ధకవిత్వతత్త్వము తెలు పుటకుఁగాను దండకమునం² కొన్ని పంక్తులిందుఁ గొనఁబఱ చుచున్నాఁడను

కైలాసమందలి శివునివర్ణనము

1 "బహుస్తంభసోపానభిత్త్యంగణప్రాంగణోపత్యకాయంత్రపాంచాలికావేదికా కేళికాందోలికాజాలికాదర్శకస్థాపితోద్యన్మణీమండలాఖండతేజోమయంబై, విరాజత్కీర్తియుం బోలె శోభిల్లు భాస్వత్సభామండపశ్రేణి మాణిక్యసింహాసనం బందు రాజచ్ఛరచ్చంద్రికాసుందరాంగున్, గంగాతరంగోత్తమాంగున్, శశాంకార్ధకోటీరసంగున్, లలాటాక్షభస్మీకృతానంగు రంగద్భుజంగేంద్రహారానుషంగున్, గరాంభోజరాజత్కురంగున్, శివున్ శైలకన్యాధవున్ శంకరుంజూచి"

— ప్రబంధరీతులు-సూర్యాస్తమయాది వర్ణనము —

2 "అంభోజబంధుండు బంధూకబంధుప్రభాబంధురుండై నభోవాతనిర్ధూత తారాపథశ్రీశిరోరత్నముంబోలె నస్తాద్రిపై వ్రాలి యంతర్హితుండయ్యె నంభోజబాణప్రతాపానలజ్వాలలుంబోలె సంధ్యారుచుల్పర్వెఁ దత్కాండబాణప్రయోగంబులుంబోలె నందంద నక్షత్రబృందంబు లింపొందె నావెన్కఁ గోకాళికిన్ భీషణాకారమై జారచోరప్రజాధారమై ఘోరగా

డాంధకారంబు శ్రీ కంఠకంఠ ప్రభాకుంఠితస్ఫూర్తి బ్రహ్మాండ ముల్నిండి తండోపతండంబుగా నుండుగానుండ।

— తెనుఁగుపదములకూర్పునేర్పు —

3 "బంగారుచీరలు వజ్రాలకంబాలు మాణిక్యపుం గోడలుం గెంపురా ద్వారబంధంబులున్ దచ్చురాతల్పులున్ గల్వరారాతిమిన్నా తనాబీలు మాణిక్యపుం దోరణమ్ముల్ బంగారంపైన ముత్యాలజాలర్లు పొందాపుతాచందువాలందమౌ పల్వొద్దాలు మేల్దివదంతంబు కుర్చీకవాదియు గంధపు న్నెటి పాత్రంబులున్ వింతవింతల్ జగాజంపు మేల్వస్తుజాతంబు తెన్నేనియుంగల్గి మిన్నేటితోరాయు మాణిక్యపుమ్మేడలో తూగుటుయ్యాలలోనుండి"

ఇది చిన్నదండకమైన నిందలి కవిత్వము ప్రబంధరీతుల ననుకరించుచు మిగులఁ బ్రౌఢముగానున్నదని మీఁదిపంక్తులే చెప్పఁగలవు రామయోగికవి సమకాలీనుఁడును సుప్రసిద్ధాంధ్ర కవిశేఖరుఁడగు నడిదము సూరకవీంద్రుని పౌత్రుఁడును నగు నడిదము సూరన్నగారీదండకముపై నొసఁగిన యభిప్రాయము నిందుఁ బొందుపఱుచుచున్నాఁడను

కం॥ బేబా యిప్పటికవులకు
సూబా నడిమింటి రామజోగి సుకవి రా
జా బాహద్దరు వహావా
శా బాసుర దండకంబు చక్కగనుడివెన్

## — బాణాసురయుద్ధము —

ఇందులికను శ్రీకృష్ణుని పుత్రుండగు 'అనిరుద్ధునకును' బాణాసురుని పుత్రికయగు ఉషకును జరిగిన వివాహమహోత్సవసమాచారము

ఇది సకల సహృదయమంజులముగా వ్రాయబడినపదము (కీర్తనవంటి ద్విపదవంటి ఒక పద్య విశేషము) వ్యావహారిక భాషాపదములు, వ్యాకరణసమ్మతముగానిరూపములు, పామరజనగ్రాహ్యంబగు పద్యముల గలిగియున్నయుంగూడి, ఇట్టిది పామరజనగ్రాహ్యమగు రంజకముగాఁ జేయబడిన దయ్యును, దీనిఁ బరిశీలించినవారికిఁ గొన్నికొన్నిపట్లఁ గవిత్వ మనఁదగు రసాద్యమత్కారము లేకపోలేదు ఆయూహాఘట్టములు నిజముగాఁ బరిపూర్ణముగాఁ దలయూచునట్లు చేయఁగలయంతటి ప్రౌఢముగానున్నవని నాయభిప్రాయము ప్రబంధ రచనావిధానప్రాభవాతిశయమునకుఁ దైవతమైయున్న యీకవి వరునికెలమీఁపదమునంద సమాతము ప్రబంధరీతులను స్వేచ్ఛగా ననుకరించి, పరిణామమును జెందినది దీనికి నికవివరుని పాండిత్యము మొదటికారణమును, ప్రబంధయుగప్రభావము రెండవకారణమునునై యుండవలెను కవితాధోరణి విశదమగుటకుఁ గాను, వివిధవర్ణములుగల పంక్తులఁ గొన్నింటి నిందుఁ బొందుపఱచుచున్నాఁడను —

## 1 కైలాసగిరివర్ణనము

వారితోడను గూడి బాణాసురుఁడు తాను
ఆవెండికొండ యొయ్యారంబు చూచెఁ
బోలుపైన వజ్రాలు పోగు పోసినయట్లు
చందమామలకోట్లు సరివెలిఁగినట్లు
చుక్కలన్నియుఁ గూడి యొక్కచో నున్నట్లు
పాలసంద్రము గట్టి పడవేసినట్లు
ఘనమైన యమృతంబు కరఁగిపోసిన ట్లు
పండువెన్నెలఁబట్టి బంధించినట్లు
ఈరేడులోకాల కెంతైనపొడవగను
ఆకొండకనపించె నతిసంభ్రమముగ

## 2 ఉషావర్ణనము

పలుకుముద్దులకొల్కి, పద్దెములుచదవంగఁ
జంకిపాపయుజారు నింకివేయేల
ఆటపాటలవేళ తోటిచేడియలెల్ల
దివిటిముందరనున్న దివ్వెలైయుండ్రు

బంగారుపుంబేట బచ్చువిల్తునివేట
నవరత్నములమూట నవకంపుతేట

ఘనమైనపూరెమ్మ కల్కిముగ్గులగుమ్మ
జీవరత్నపుబొమ్మ విస్సలేఁగొమ్మ

దిద్దితీర్చినలాగు, తీర్చిఁవ్రాసినలాగు
చెప్పినట్లుండె నావెలియదొరతీరు

## 3 వసంతము

పండుటాకులురాలె పారుటాకులుపుట్టె
మొల్లమై యిగురించె నెల్లవృక్షములు
ననలెంతొ యొకవింత నవకంబు లుప్పొంగ
పూలతోటలు చాలఁబొలుపొందెవంత
గండుకోయిలలెంత ఘనముగాఁగూయఁగను
చిలుకపలుకులు చాల కలకలంబెసఁగె

## 4 చంద్రోదయవర్ణనము-వెన్నెల

తరువాతనొకవింత తళుకుప్పతిల్లంగ
బరఁగదూరుపుదిక్కుపాటుపారెనుగ
వెలలేనిముత్యాల వెల్లగొడుగునుబోలె
నెలదూరె నొకవింత చెలువుమీరగను
మంచుచల్లినలాగు మాయచేసినలాగు
పండుచీకటి పటాపంచలైపోయె

నెఱరాయడు గుండె[illegible] లుప్పొంగగాను

పొంగివెన్నెలపిట్ట లలరెనంతటను

వెల్లవేసినలాగు వెండిపూసినలాగు

అన్నిభూములు తెల్లనై యుండెనపుడు

### 5 చిత్రలేఖకళానైపుణ్యాదికములు

ఎవ్వఁడో గాని నన్నింతగా వలపించి

మాయచేసినలాగు మాకుఁ దోఁచెనుగా

కల్లగా దిమాట గట్టిగా నిమోము

వలపువాసనవేసె వనితవింతగను

కొమ్మరో! వీఁడె నాకొల్లలాడినవాఁడు

వీఁడె నాతల్లిరో! వెదకివ్రాసితివి

### 6 లోకోక్తులతోఁగూడిన రచన

ఎంతేసివారైన నెదిరించలేకుండ

కెంపుకోపలచల్ల కదలకుండెనుగా

కల్లు మొగమునగాని కలుగవెవ్వరికైన

చేత కల్లున్నచే చెలియరో నీకు

. . .

ఆడినదిమాటగను పాడినదిపాటగను

తానె రాజై యుండె దనుజవల్లభుఁడు

పాముపిల్లకు నెంతపాలుపోసినగాని
విసముపెరగునుగాని వేఱొకటియగునా?
ముసిడిచెట్టుకు తేనెపోసి పెంచినగాని
దానిపండ్లను దీపు తా నేలకలుగు

ఇట్లు రసభావగర్భితములగు వర్ణనాదలను బెక్కింట నింకను జూపవచ్చునుగాని, గ్రంథవిస్తరభీతిచే నింతటితో విరమించుచున్నాను

ఇంకఁ బైనిజెప్పియున్న ప్రకారము రామయోగికవి శ్రీపూసపాటి కొండరాజుగారి యాశ్రయమును బొంది తెంకాడలో నున్నకాలముననే యీపద్యమును దనశూద్రశిష్యులకొఱకు రచించినట్టుగ నీగ్రంథాంతముననున్న యీక్రిందిపంక్తుల వలనఁ దెలియనగును

"రాణించు నడిమింటి రామజోగి యనంగ
వాసికెక్కిన కవీశ్వరుఁడఁ జెప్పితిని
రక్తాక్షిసంవత్సరమునందు నాశ్వీజ
శుద్ధపాడ్యమి సరికి సొంపుగానయ్యె
సంబూరిపెద్దయ్య యదిగార మొనరింప
తెంకాడలోఁ బుట్టి కవిత్వ వెలసె'

## పచ్చమెట్టి పాపయకవి

(క్రీ శ 1765—1840 సం)

ఇతఁడాఱువెలనియోగిబ్రాహ్మణుఁడు హరితసగోత్రుఁడు కాపురము విశాఖపట్టణమండలములోని విజయనగరమునకుఁ దూర్పుగా సముద్రతీరమునందున్న కోనాడ గ్రామము "గూడపువలస" యను నూరిలో నౌఖరీయినాముభూములు కలవాఁడయ్యును కులక్రమాగతముగ వచ్చు కరణీకము చేయక, కవితావృత్తిచే నీయాత్ర గడపినవాఁడుగాఁ గనఁబడుచున్నాఁడు ఇతనిబాల్యము విద్యాభ్యాసము మొదలగువాటినిగూర్చి యేమియుఁ దెలియరాకున్నది పాపయకవివరుని సరసకవితకుమెచ్చి యతనిఁ దనముఖ్యాశ్రితునిగాఁ జేసికొని, యశస్సునార్జించిన ధన్యుఁడు వైశ్యకులసంజాతుఁడగు—

### మగటపల్లి కామయ్యశ్రేష్ఠి

ఈవైశ్యశిఖామణి సూరమవెంకనలపుత్రుఁడు బాపిసెట్టి పౌత్రుఁడు ఐశ్వర్యగరిమచే నభినవకుబేరుఁడనిచెప్పనొప్పినవాఁడు దానరాధేయుఁడు సప్తసంతానములు భూమిపై నిలిపి కీర్తిగన్న పుణ్యతముఁడు సామాన్యుఁడగువర్తకుఁడుగాఁ గాలముగడుపుచుండిన యీతనితండ్రి వెంకన్నకును, పిదపనీతనికినిలభించిన ఐశ్వర్యమునకుఁ గారణము లోకమిట్లు చెప్పుచున్నది కోనాడ గ్రామమునకు సమీపముగా సముద్రములో నొకయోడమునిఁగిపోయినందున అందులోని నల్లమందచ్చులు కొన్ని కోనాడరేవు

నకుఁ గొట్టుకొనివచ్చినవి జేంగుమీఁదివారు వాటిని పిడకలుగా భావించి, కోమటియింటఁ నమ్మఁ జూపిరి వెంకన్నసెట్టిమాత్రము దాని నిజతత్త్వముఁ గ్రహించి, స్వల్పధనమునకు నాయచ్చుల నన్నింటినిఁ గొని విరివిగా వర్తకము సాగించి పదిలక్షలరూపాయలనార్జింపఁ గలిగెను వానియనంతరము కుమారుఁడగు కామయచంద్రుఁడు వర్తకము నభివృద్ధిచేసి, "శ్రీవెంకటేశ్వర," "రామలింగేశ్వర," "ఆంజనేయ" యను నామములతోఁ బదియోడలు సేకరించుకొని యోడబేరము సేయఁ దొడఁగెను ఐశ్వర్యము దినదినాభివృద్ధిఁ బొందెను ఇట్లుండ నొకకాలమున నొకయోడలోఁ గొన్ని కలకత్తాకువెళ్ళి వచ్చుచుండగా మార్గమధ్యమున నోడసరంగునకు రెండుగురుతులు కానవచ్చెను వెంటనే ఆగురుతులుగాఁగానవచ్చినవస్తువుల నోడమీఁదికిఁ దేర్చికొని, కోనాడకువచ్చి వాటిని తనస్వామికి సమర్పించెను కామయగారాపెట్టెను విప్పిచూడఁగా నందొకటి బంగారుకణికలతోను, రెండవది వివిధరత్నములతోను, నిండియుండుట చూచి, తనపూర్వజన్మ సమార్జితపుణ్యపరిభావమునకుఁ గడుంగ నాశ్చర్యమును, సంతోషమును బొందినవారై యామోడవర్తకముతోఁ బాటు రత్నవర్తకముఁ గూడ సాగించి, లక్షలకొలఁది ధనమార్జించెను ఈరీతిగ నార్జించిన ధనమును జాలవఱకు ధర్మకార్యముల కెవినియోగించి, వితరణఖనియని పేరుగాంచి ధన్యుఁడయ్యెను ఈమహాదాత నూతులు, కోనేరులు త్రవ్వించెను తోటలు వేయించెను దేవాలయ

ములు ప్రతిష్ఠించెను. అన్నసత్రముల నిలిపెను. దీనజనచింతామణియై యనేకములగు పేదకుటుంబముల కన్నవస్త్రములిచ్చి పోషించెను. కామయచంద్రుని వితరణాదిగుణములను పాపయ కవి యిట్లు ప్రశంసించి యున్నాఁడు.

కం. ఏనాఁడును గోనాడను
దానముధర్మంబు నన్నదానముగలవా?
నీనాఁడెకాక వితరణ
కానీనా మకటపల్లి కామయచంద్రా!

కం. ఊరూరను గోనేరుల
నోరూర సుధానుకారి నూతనవారి
స్ఫారముగఁ జేయవే శుభ
కారణగుణ మగటపల్లికామయచంద్రా!

కం. జీవమణీమంటపహే
మావరణప్రభల వెలయునబ్జాక్షమహా
దేవనివాసస్థలములఁ
గావింపవె మగటపల్లి కామయచంద్రా!

కారణజన్ముఁడగు నీకామయచంద్రుఁడు డెబ్బది సంవత్సరములు జీవించి, క్రీ. శ. 1834 సంవత్సరములో స్వర్గస్థుఁడయ్యెనని, ఆయన పౌత్రులగు బుచ్చికామయకవిగారు కామయచంద్ర శతకపీఠికలోఁ దెలిపియున్నారు.

కవికాశ్రయుఁడైన కామయశ్రేష్ఠికాలము క్రీ శ 1765-1834 మధ్యకాలమగుటచే పాపయకవీంద్రుఁడుఁ గూడ నాకాలమువాఁడే యని మనము నిశ్చయముగాఁ జెప్పవచ్చును పాపయకవికి సంస్కృతాంధ్రములయందుఁ జక్కనిపాండిత్యము కలదు. కవిత్వము మృదుమధురమై యెంతయు మనోహరముగా నున్నది ఇతనికవిత్వమునందు సంస్కృతాంధ్రపదజాలము సమముగాఁబడి రుచులినుమన్నది ఈతఁడు వ్రాసినగొప్పగ్రంథము లేవియుఁ గానరావు ఒక్కకామయచంద్రశతకము మాత్రము అచ్చుపడ కతిపయసంవత్సరములనుండి ప్రచారములోనికివచ్చినది మహిషాసురమర్దని శతకమొకటి రచించినట్లుగా జనశ్రుతి గలదు కాని అదియుఁగూడ సంపూర్ణముగా లభింపలేదు చాల కష్టముపైని దానిలో నొకపద్యముమాత్రము లభ్యమైనది ఇదిగాక శ్రీమద్రామాయణములోని సుందరకాండకథను దండకముగాఁ జెప్పియున్నాఁడు కామయచంద్రశతకములోని గొన్ని పద్దెములు సూరకవివిరచితమగు పొణ్ణుపాటి వేంకటమంత్రి శతకములోని పద్యముల ననుకరించియున్నవి ఈయనుకరణము కృతికర్తకు సూరకవి కవితయందుఁగల గౌరవమును సూచించుచున్నది అట్టిపోలిక పద్యములతోఁబాటు శతకములోని మఱికొన్ని పద్యములను, గవితాధోరణి తెలియుట కీదిగువ నుదాహరించుచున్నాఁడను —

కం. లేఁక సవి గాఁ దరించని
వాఁగన్ నీయింట భక్తిపడయనిద్విజుఁడున్
బోడిమిమీఱఁగ నిన్నున్
వేఁడనికవి పొన్గుపాటి వెంకటమంత్రీ! (సూరకవి)

కం. వానందడియని మనుజుని
దానము నీచేతఁగొనని దరిశిపురునిన్
గానము ధరలో వితరణ
కానీనా మగటపల్లి కామయచంద్రా! (పాపయకవి)

కం. వెన్నెలవలె కర్పూరపుఁ
దిన్నెలవలె నీసుకీర్తి దిగ్దేశములన్
మిన్నంది వన్నెకెక్కెను
విన్నావా? పొన్గుపాటి వెంకటమంత్రీ! (సూరకవి)

కం. వెన్నెలవలె వజ్రంబుల
తిన్నెలవలె నీసుకీర్తి త్రిజగము లందున్
మిన్నంది వన్నెకెక్కెను
గన్నాకై మగటపల్లి కామయచంద్రా! (పాపయకవి)

కం. మూఁడేఁబదు లెవరుండరు
మూఢుండిది గానలేఁడు ముల్లోకములన్
వాడుకపడవలె మనుజుఁడు
వేఁడుకతో బత్తులయ్య! వినగదవయ్యా! (సూరకవి)

కం కలకాల మెవ్వరుండరు
ఖలులదిగాంగ లేక గర్వింతురు ని
ర్మలకీర్తియొకటి నిలుచును
గలకాలము మగటపల్లి కామయచంద్రా! (పాపయకవి)

కం లలిసంస్కృతాంధ్రభాషా
కలితకవిత్వంబు ప్రీతికరమగుద్రాక్షా
ఫలములలో విరితేనియఁ
గలిపినక్రియ మగటపల్లి కామయచంద్రా! 1

కం దివ్యంబులు సుమనోజన
సేవ్యంబులు కృతిపతిప్రసిద్ధకుల యశో
భావ్యంబులు భవ్యంబులు
కావ్యంబులు మగటపల్లి కామయచంద్రా! 2

కం తోయ్యాలులు వీథులం జన
నియ్యకొనరు నీవ కీర్తి హేలావతి తా
వెయ్యేల రచ్చకెక్కెను
గయ్యాళా? మగటపల్లి కామయచంద్రా! 3

కం హారమునకు దారము వ్యావ
హారమునకు నిత్తి, భూమికధిపతి తరికిఁ
మేరయగు మారుతంబును
గారణములు మగటపల్లి కామయచంద్రా! 4

కం తన్నాశ్రయించు మనుజుని
మన్నించని ప్రభువుకన్న మహిషము మేలౌ
దున్నిఫలంబిచ్చును ద్విజ
గన్నుత ! శ్రీ మగటపల్లికామయచంద్రా! 5

ఉ ఏ నినునమ్మి యన్యులను నెమని వేఁడఁగఁబోదునమ్మ! నా
హీనతఁ బాపి ప్రోవుమిట నేనుఁగు నెక్కియు దిడ్డిదూరఁగా
లేనుగదమ్మ! కోర్కెలు ఫలింపఁగఁ జెయ గదమ్మ! వేగమీ
శానకళత్ర హైమ గిరిజా! మహిషాసురమర్దని శివా! 6

(మహిషాసురమర్దనీశతకము)

ఈకవిప్రవరుని సంస్కృతాంధ్రపాండితీవిభవము తెలుపుటకుఁగా నీతనికృతమగు "హనుమద్దండకము' లోని కొంత భాగము నిచట మాదిరికినై యుదాహరించుచున్నాఁడను —

"కాలారిపుత్రా ! స్ఫురద్దివ్యసౌందర్యహేమాభగాత్రా! లసద్భీకరోదార ఘోరార్ణవోల్లంఘనోపాయ సూత్రా! లసత్ఫుల్లకంజాతనేత్రా! భుజాటోపవిస్ఫూర్జితానేకనక్తంచరాభీల గాఢాంధకారప్రభా కోటికంజాతమిత్రా! సురాధీశకుంభీంద్ర గౌరీంద్ర తారేంద్ర నీహారడిండీర కర్పూరమందారకుందప్రభాశారదోద్యద్యశస్సార! ' అనియు, వేఱొకచోట —

ఓవానరాకార నేమాననాకారుఁడన్ క్రూరుఁడ న్నిన్నుఁ బూజించి ప్రార్థించి, సేవించగా నాకభూలోకనాగేశులుం జాలరే నెంతవాఁడన్" అనియు-

మాంతి సీతఁగూర్చి వెనుక స్తంభముల నిట్లు చెప్పి యున్నాఁడు

చిత్రగంభీరరత్నాంచిత స్తంభకాంతి స్ఫురత్తోరణానేకసంశోభితాపారలావణ్య భృంగాళికావర్గమా, యిందిరాధామకైలాసభూమీధరేంద్రోపమోద్గార శృంగారసౌవర్ణ దుర్గంబులా గేహవర్గంబులా బందువర్గంబులా రాజమార్గంబులా, సందులా గొందులా వాడలా నీడలా మేడలా పేటలా తోటలా బాటలేర్పాటుగా, తేటతెల్లంబుగా నీఁడుగావచ్చి శోధింపవా ?"

మీఁదిపంక్తులఁబట్టి చూడఁగా నీపాపయకవి తనకాలమునకుముందు ప్రసిద్ధములై ప్రచారములోనున్న అడిదము సూరకవికృత శ్రీరామదండకమును, నడిమింటి రామయోగికవి "భల్లాణ"దండకమును ననుకరించెనని చెప్పకతప్పదు



## 12 కాళ్ళకూరి గౌరీకాంతకవి

(సుమారు క్రీ శ 1780-1830 సం॥)

ఇతఁడాఱువేలనియోగిబ్రాహ్మణుఁడు భారద్వాజగోత్ర పస్తంబసూత్రుఁడు సూరయామాత్యపుత్రుఁడు కాపురము విశాఖపట్టణమండలములోని చీపురుపల్లి తాలూకాయందలి గోప్పేటగ్రామము ఈతని తాతతండ్రుల నాఁటినుండియు నీ కుటుంబమువారు గోప్పేటగ్రామముసే నివసించుచు, నాయూరి కరిణీకమును జేయుచున్నారు గౌరీకాంతునిబాల్యము విద్యాభ్యాసము మొదలగు విశేషాంశములను గూర్చిన సమాచారము దొరకకుండుటయెంతయుఁ జింతాకరము ఈకవి తన ప్రబంధమగు "ధర్మనందనవిలాసము" యొక్కకృత్యాదినిఁ దనపూర్వుల కవితాసామర్థ్యాదుల నిట్లు ప్రశంసించియున్నాఁడు —

సీ శ్రీగోత్రపతిభక్తి మీగోత్రపతులెల్లఁ
　　గవుల యిరమర భార్గవులఁబోలి
మీవంశకర్త లక్ష్మీపతి భద్రాప
　　రిణయ ప్రముఖలసత్కృతులుచెప్పె
మీపెదతండ్రి నిర్మించెను రసవినో
　　దాదికావ్యములు పేరయమనిషి
మీతండ్రి రచియించెఁ బ్రీతిసీతారామ
　　చారిత్రముఖకృతుల్ సూరసుకవి

తే గాన వాణీకటాక్షవిక్షణముచేతఁ
గవనమెప్పాఁగ మీాయింటఁ గలిఁగియుండఁ
జేసె తత్తత్ప్రసాదసంసిద్ధివలనఁ
బొందియున్నది రచనావిభూతి నిన్ను

దీనినిబట్టి యూహింపఁగా నీకాళ్ళకూరివారికుటుంబము కవితాప్రవృత్తిచే విఖ్యాతిగాంచిన కుటుంబముగాఁగనఁబడుచున్నది తాతతండ్రులు ప్రజ్ఞాసంపత్తిగల కవులైన కారణమున నీగౌరికాంతకవి విద్యాసంపాదనము వారియొద్దనేగావించి,యుండవచ్చునని మనము దలఁపవచ్చును ఈతఁడు తనకృతినాయకునివంశాభివర్ణన సందర్భమున నతనిప్రభువగు శ్రీ విజయనగరపురాధీశుని శ్రీ పూసపాటి నారాయణగజపతి మహారాజుని నిట్లు వర్ణించియున్నాఁడు

సీ నిత్యగంగాస్నాన నిఖలదేశాస్థాన
పూజితకీర్తి యేపుణ్యమూర్తి
శ్రీరంగనాథ పదారాధనోన్మేష
పరమపవిత్ర మేప్రభుచరిత్ర
మురుసువర్ణంబు వక్షోదయాకారి మా
ధవవర్మ యేకులోత్తముని పూర్వుఁ
డశనిఖండన పటిష్ఠాఖండ దోర్దండ
పాం

తే గీ డట్టి శ్రీ పూసపాట వంశాబ్ధిచంద్ర
విజయరామ సర్వంసహాధిపతినూజుఁ
డరుణ నిభ తేజుఁ డలరు నారాయణగజ
పతిమహారాజు భోగసుపర్వరాజు

దీనినిబట్టి కృతిపతి కృతికర్త లిరువురును క్రీ శ 1780-1860 మధ్యకాలమున శ్రీవిజయనగరసంస్థానమును బరిపాలించిన శ్రీ నారాయణగజపతిమహారాజు గారి రాజ్యకాలమున నున్నవారని నిశ్చయింపవచ్చును కాఁబట్టి గౌరీకాంతకవి 19 శతాబ్దిపూర్వ భాగమునకుఁ జెందియున్నవాఁడు

కృతినాయకుఁడగు వెలిచేటి గురురాయఁడు కమ్మకుల జుఁడు కందాళగోత్రోద్భవుఁడు విశాఖపట్టణ మండలమందు భోగాపురపుపేటలో వెంకటేశ్వరస్థలము చెంతనున్న "బంటుపల్లి" గ్రామ మీతనినివాసస్థానము ఈతఁడు శ్రీవిజయనగరపురాధీశ్వరుని దయ కుఁ బాత్రుఁడై యానృపవరునిపాలనములో దండనాయకాధి కారము కలిగియున్నవాఁడుగాఁ గనఁబడుచున్నాఁడు ఈతనిపూ ర్వులు పరాక్రమశాలురై సంగ్రామభీములై గళింగదేశరాజుల వలన నమితసన్మానముగాంచి విశేషప్రఖ్యాతిగడించిన వారలని కృతికర్త కృత్యాదిని విపులముగ నభివర్ణించియున్నాఁడు ఆసంద ర్భమునఁ జెప్పఁబడిన పద్యముల నొకటిరెంటిని క్రిందఁ బొందుప రచుచున్నాఁడను —

తే. మేలువకుఁ దల్లి త్రికిఁ బాలవెల్లి
తలితల్లికి మేలు ముత్యాలజల్లి
వెండి బంగారముల కెల్ల నింపుపల్లి
ప్రాభవపుతల్లి యతఁ డేలు "బంటుపల్లి"

సీ. ధర్మనిలయుఁ డయ్యకు ముఖమున బాహువు నూరుపాదవ
నాసల బ్రాహ్మణ క్షత్రియులు క్రమమ్మునఁ బుట్టిరి వేదధర్మలై
స్థలసంగ బ్రాహ్మణ క్షత్రియులార్యులు శూద్రలాంధ్రదే
శమ్మునను౦ట శూద్రులు ప్రశంసకు నెక్కిరి యందుఁగర్మలై

గౌరికాంతకవి రచించిన గ్రంథమొకటి "ధర్మనందన విలాస" మను పేరుకలది. మా మిత్రులు శ్రీయుత కొవ్వలి జగన్నాథరుపంతులు బి. ఏ. గారి సౌదార్యమున నాకు లభించినది. ఇదిగాక యితఁడు మఱియే యితర గ్రంథములు వ్రాసియుండెనో తెలియరాకున్నది. తత్తాతతంత్రుల కవితాప్రజ్ఞవలను గృతినాయకుని ప్రశంసించుటను గ్రంథారంభమున నొక సీసపద్యములోఁ జెప్పియున్నాఁడు. అంతియేగాని తన్నుఁగూర్చి గాని తన వంశముఁగూర్చిగాని విశేషము లేవియుఁ జెప్పలేదు.

ఇంక గ్రంథవిషయము

"ధర్మనందనవిలాసము మూఁడాశ్వాసముల ప్రబంధము. ఇందలికథ పాండుపుత్రుఁడగు ధర్మరాజునకును, విదేహరాజపుత్రికయగు కళావతికిని జరిగిన వివాహమహోత్సవసమాచారము. ఇందు ప్రథమాశ్వాసమున అవతారికపద్యములు, కృతినాయ

కునివంశవర్ణనము, కథానాయకుఁడగు ధర్మరాజుగుణవర్ణనము, పురవర్ణనాదులు, జనకునిగుణవర్ణనము, సంతానముఁగూర్చి యతఁడు శివుని నారాధించుట, ఈశ్వరసాక్షాత్కారము, వరప్రదానము మొదలగునవి యభివర్ణింపఁబడినవి

ద్వితీయాశ్వాసమున —విదేహరాజగు జనకునిభార్య గర్భవతియగుట, కతిపయమాసములకుఁ బుత్రికాసంతానము, రాజపుత్రి కళావతీనామముతోఁ బెరిగి వర్ధిల్లుట, ఆమెరూపయౌవనాదులవర్ణనము, కళావతీవివాహప్రసంగము కళావతీపాండుపుత్రులపరస్పరప్రేమ, భూసురసందేశము, నాయకీనాయకుల విరహము, చంద్రాద్యుపాలంభనముఁ కళావతిస్వయంవరమహోత్సవము, దానికై వచ్చినరాజన్యుల గుణాభివర్ణనము, స్వయంవరమునఁ గళావతి ధర్మజుని వరించుట, మున్నగునవి యిందు జెప్పఁబడియెను

తృతీయాశ్వాసమున —వివాహసన్నాహము, ధర్మజుని కల్యాణయాత్ర, పెండ్లిపెద్దయగు కృష్ణస్వామివర్ణనము, వివాహమహోత్సవము, నయవిరచనము, నూతనవధూగృహప్రవేశముం శోభనము, పుత్రోదయము మొదలగునవి వర్ణింపఁబడినవి

18 వ శతాబ్దోత్తరభాగమునను 19 శతాబ్దప్రారంభమునను—అనఁగాఁ బ్రబంధరచనావిధానము అగత్రిమగ ఎనుకిరణమునకులోనై పరిణామమొందినకాలమున వ్రాయఁబడినపెక్కు

ప్రబంధములతో నిర్ధనసంద విలాసము దీటురాకపోదు ఈ గ్రంథమునందుఁ గవి పలుతావులఁ జర్వితచర్వణముగఁ జెప్పిన దానినే మరలఁ జెప్పుటచే పద్యములసంఖ్య హెచ్చించియున్నాఁడు. స్వయంవరవర్ణనాదిసభయందు రాజులవర్ణించి చెప్పిన పద్యములసంఖ్య విసుపుపుట్టించునంతటి హెచ్చుగానున్నది పరిణయోత్సవకాలమున జరిగిన బ్రాహ్మణసమారాధనవర్ణనము హాస్యరసపూరితముగఁ జేయఁ గవియుద్దేశించెను, మొత్తము మీఁద నదిపరిహాసాస్పదముగనున్నదేమో యని నాసందియము ఈక్రిందిపద్యమును దిలకింపుఁడు

సీ. కూరలతృప్తిఁ జేకూరెమాకును నింకఁ
బచ్చళ్లు దెమ్మని పలుకువారు
పచ్చళ్లరుచిగాఁబడెమెతుకు మాకింకఁ
బులుసుచారెడటంచుఁ బలుకువారు
పులుసుచారులఁ దృప్తిపొందితిమిఁక మీఁద
భక్ష్యముల్ దెమ్మని పలుకువారు
భక్ష్యముల్గొంటి మీపాటి పాయసము తి
మ్మనములు దెమ్మని యనెడివారు
గీ. పాయసము తిమ్మనములుండె ఫలరసములు
పెరుగుపాల్చల్ల దెమ్మని పిలుచువారు
నగుచు బ్రాహ్మణముఖ్యు లాద్యంతయుక్త
భుక్తిఁ గైకొన్న వార్కి నప్పుడు నృపుండు

గీ తాను మం ది ... షు మి।
యగ్రముకుఁ సంగ్రామ మావహించిన
పెనువెఱ్ఱులు ... లదార కొనెనిచోటఁ
దనుజ ననికించు వ ఁషదధ్యాననిరతి

ఉ ఎట్పదకేతనేశ భువనేశ మహార్షిగణేశ దేవతా
రాట్పవమానమిత్ర యమరాడసుజాబ్ధిపవాయుయక్షులున్
న్నేట్పకిపాఁ కోపకిఘృతింబెఱఁ బాఱరి మార! యింక నీ
షట్పదశింజనికుసుమసాయకపంక్తి కెంతు లోర్తురె

సీ శరదబ్జవదన నేచుఁగఁదలఁతురె నను
యమ్మంచు నిలకంఠమ్ములార!
కన్నులెఱ్ఱఁగఁ జెఱఁగారాము రామపైఁ
గేరుచు సారె కోకిలములార!
పలుకాదరింపక చిలుకలకొలికపైఁ
గినలుటమేలా శుకమ్ములార!
తలదాల్చి మిమ్ముఁ నళికచ ఝుంఝుమ్మ
రనరాకువినఁదు షడంఘ్రులార!

గీ తరుణిపైఁ గోపపడి కూయఁదగదు మీకు
మైనగోరింకలార యేమైనగాని
హంసగామిని నలికింప ననువుగాదు
వాలు నిఁటఁబోంపు రాజహంసమ్ములార!

(2 అశ్వా)

ఉ. వందనగంధికన్నులను జలఁగఁజూడఁగదమ్మ పెండ్లివా
రందఱికన్న ముందర నొయారముమీఱఁగ గోపసుందరీ
సుందరుఁ డిందిరాహృదయచోరుఁడు వారలలోనఁ బూర్ణిమా
చంద్రుఁబోలెఁ గాంగ సరసత్వముఁజూపెఁ బెండ్లిపెద్దయై

మ. ఘటికాదేవుల్ శుభమాచరింపన్నృపతుల్ సేవింప విట్చ్ఛద్రసం
తతిమోదింపను సత్కవీంద్రులు ప్రబంధంబుల్ రచింపన్ సదా
శ్రితులై గాయక సూతమాగధులు వర్ణింపన్నటింపన్నహో
వ్రతినేలెన్ సుఖముండి కృష్ణుఁ డిలాచక్రం బవక్రంబుగన్

---

# పుండిపాక కామకవి

## (క్రీ శ 1810-1870 సం )

ఇతఁడు వేఁగినాటివైదికబ్రాహ్మణుఁడు పారాశరగోత్రజుఁడు కోనమపేరియలకుఁ బుత్రుఁడు లచ్చనార్యుని పౌత్రుఁడు జన్మస్థలము విశాఖపట్టణమండలములోని బొబ్బిలిపుర సమీపములోనున్న "కామనవలసాగ్రహారము" ఈతఁడు క్రీ శ 1810 సంవత్సరప్రాంతమున జననమొంది 1872 సం॥ రమునఁ గీర్తిశేషుఁడయ్యెనని యీకవివరుని ప్రపౌత్రులగు శ్రీరామశాస్త్రిగారు చెప్పుచున్నారు కామనవలస పూర్వ మీకవివంశజులకు శ్రీబొబ్బిలిపురాధీశులు అగ్రహారముగ దయచేసిరని వినుచున్నాము ఇక్కడఁ గవిగారి కనిష్ఠపితామహుఁడు సోమనార్యుఁడు సోమేశ్వరాలయము బ్రతిష్ఠించి, దేవుని భోగరాగాదులకుఁ గొంతభూవసతి నేర్పాటుచేసి ధన్యుఁడయ్యెను ఆశివాలయము నేఁటికిని మంచిస్థితిలోనుండి యథాక్రమముగ రాగభోగాదు లందుచున్నదని తెలియవచ్చెడిని

కామకవికి సంతానము నలుగురు మువ్వురుకుమారులు నొక కూతురు పెద్దకుమారుఁడు రామస్వామిశాస్త్రి అవధూతానుభూతి, గీతాశాస్త్రము మొదలగు గ్రంథములు రచించి పేరుగాంచెను రెండవవానిపేరు పార్వతీశ్వరశాస్త్రి రాధాకృష్ణసంవాదము మున్నగు ననేకగ్రంథములు రచించి విద్వత్కవిబిరుదము సన్వర్థముచేసి శ్రీబొబ్బిలి సంస్థానాస్థానకవిపదము

నలంకరించిన కవితల్లజుఁడు మూఁడవకుమారుఁడు పేరయశాస్త్రి గొప్పమంత్రశాస్త్రవేత్త కామకవి సజీవుఁడై యున్నపుడే పుత్త్రులందఱు గొప్పవిద్వాంసులై యశస్సు నార్జించి యాతని కత్యంతానందమును గూర్చుచువచ్చిరి

ఈకవివరుఁడు బాలుఁడై యున్నపుడె తండ్రియగు పేరయకవి నానాఁటికి వృద్ధియగుచువచ్చిన కుటుంబమును లెస్సగా సంరక్షింపఁజాలక యప్పులవాఁడై యగ్రహారపుభూముల రాండిడి అప్పుపైఁ బెరుఁగువడ్డక్రింద విడచిపెట్టి బొబ్బిలికి నాతిదూరమునందున్న పాత్రేరును గ్రామమునకు సకుటుంబముగ నెడలివచ్చి శ్రీ బొబ్బిలిమహారాజవంశమునకు సన్నిహితబంధువర్గములోఁ జేరిన శ్రీదామెరవారి యాశ్రయమును బొంది, జీవయాత్ర సాగించుచుండెను పాత్రేరునకు వచ్చుసరికిఁ గామకవి 15 16 సం॥రములప్రాయమువాఁడు అప్పటికే యాతఁడు సంస్కృతమునఁ గావ్యపంచకము ముగించి, నాటకాలంకారగ్రంథములఁ జదువుచుండెను తండ్రిగారిశిక్షక్రింద శ్రద్ధాళువై విద్యఁగఱచుచుఁ దననిరుపమానప్రతిభ చే నచిరకాలములో గొప్పసాహితీపరుండయ్యెను తనతండ్రిగారికి కష్టములేకుండఁ దానే తమకాశ్రయులైన వెలమవారికి విద్యాగురువై పాఠములఁ జెప్పుచువచ్చినందున శిష్యులగు వెలమవారును, నింక గ్రామములోనివారును నీతనియెడ భక్తిగౌరవములు చూపుచువచ్చిరి ఈతనికి నిరువదియైదేండ్లు వచ్చుసరికిఁ దండ్రిగారగు పేరయకవి స్వర్గస్థు

తియ్యేను [illegible] శతకము, కుముద్వతీపరిణయము, ఇంక మహేశ...ము అనునవి పేరయకవి రచించిన గ్రంథము లని చెప్పుచున్నారు. ఒకానొకప్పుడు మంచెపాకవారియిల్లు అగ్ని ప్రమాదమునకు లోనుగాఁగా నింతకుమున్ను సంగ్రహింపఁబడిన యనేకములగు తాళపత్ర గ్రంథములతోఁబాటు పేరయ విరచితగ్రంథములుఁగూడ వహ్నిహోత్రుని కాహుతియయ్యెనఁట. అయిన నాంధ్రసంగ్రహములలోని కొన్నిపద్యము లనుమాత్ర మీవంశములోనివారు సేకరించియున్నారు.

కామకవి తన ప్రతిభా విశేషముచే నానాఁటికి నుభయ భాషలయందును గొప్పసాహిత్యము గలవాఁడై [illegible], రెంటియందును సరసమగు కవిత్వముచెప్పఁజాలి దాతాశ్రయులైన వెలమవార గౌరవమునకుఁ బాత్రుఁడై, తనజీవితకాలమునం దయ్యె ‘బాలబోధ’ యనఁబడు ఇతరులకుఁగల సంస్కృతసాహిత్యమవారము ...కవిత్వము...ంచు మూఁడుపాళ్లు సంస్కృతము, ఒకపాలు తెనుఁగు ఇతఁడు పెక్కుగ్రంథములు రచించెను. అవ్వి - బలరామక్షేత్రమాహాత్మ్యము, బ్రహ్మోత్తరఖండము, కార్తికవ్రతమాహాత్మ్యము, రామచంద్రప్రభుశతకము, శ్రీసూర్యనారాయణశతకము, జానకీరామశతకము, అష్టకములు, దండకములు ప్రకృతమున నీకవివరుని కవితావిశేషముల వివరించిచెప్పుటకు నాకులభ్యమైన గ్రంథము—

'బలరామక్షేత్రమాహాత్మ్యము— ఇదియొక స్థలపురాణము ఇందు నాగావళితీరమున నెలకొల్పఁబడిన శైవక్షేత్రముల మాహాత్మ్య మభివర్ణింపఁబడినది ఈశైవక్షేత్రములన్నియుఁ గృష్ణాగ్రజుఁడగు బలరామునిచేఁ బ్రతిష్ఠితములు లాంగలినదినిఁ గూడ హలియే నిర్మించెనని చెప్పఁబడెను

"శ్రీ హలితీర్థాటనకాలమందు నొక దివ్యక్షేత్రమున్ నిత్యని ర్మలతోయాపగయున్ రచించె బలరామక్షేత్రమున్ నాఁగలాం

గలినా" అని గ్రంథారంభమునఁ జెప్పఁబడియున్నది

మహాభారతయుద్ధకాలమున బలరాముఁడు కౌరవపాండవులలో నేకిని సాహాయ్యముసేయనొల్లక, తీర్థాటనమిషను నిజదేశమునుబాసి చనెను ఈవిషయమే యీగ్రంథమునందు "శ్రీ దూరాలోచనసేయఁ గౌరవులకున్ దోడైతినాకృష్ణుతో వైరంబిప్పుడె వచ్చుఁ బాండవులఁగావంబోవగా శిష్యసం హార క్రూరంతసంఘటిల్లు"ననియుఁ గావున "చ ఇప్పుడె తీర్థయాత్రమిష నేరదవేగమె" యనియుఁ జెప్పఁబడినది ఇట్లు బలరామమూర్తి సముచితపరివార పురోహితామాత్యభూసురవరసమేతుఁడై శ్రీకృష్ణాదులను వీడ్కొని, ద్వారకాపురము వెడలునపుడు శ్రీకృష్ణుఁ డగ్రజునకు నమస్కరించి "అన్నా కళింగదేశమునఁ గచ్ఛపేశ్వరునిక్షేత్రములోపలఁ బశ్చిమప్రదేశమున లోకోపకా

---

* 1 పాయకపాడ 2 గుంప 3 సంగాం 4 శ్రీకాకుళం 5 మఫజ్ బందరు

రకముగఁ గార్యమొకటి నిచే నిర్వహింపఁబడు నని చెప్పెను
(ఇది ప్రథమాశ్వాసము)

ఇట్లుకదలిపోయి బలరాముఁడు పరమపావనియగు గంగా నదిం దర్శించి, యందుఁ గ్రుంకులిడు వారాణసీప్రముఖ దివ్యక్షేత్రములసేవించి, కతిపయప్రయాణంబుల భువనేశ్వరక్షేత్రముం జేరుకొనెను అచ్చట నంబికాభువనేశ్వరులఁ బూజించి, పదపడి పురుషోత్తమక్షేత్రమున శ్రీజగన్నాథుని సందర్శించి ధన్యుఁడయ్యెను. అటు తరువాత ఋషికుల్యానదీతీరస్థిత తుంబిశ్వరుని వంశధారానదితీరజయంతక్షేత్రమందలి మధుకేశ్వరస్వామిని, (ఇప్ప టిముఖలింగక్షేత్రము) రత్నాచలనివాసుఁడగు పద్మనాభస్వామిని సంసేవించి, యాదివ్యక్షేత్రములందలి దర్శనీయవస్తువులఁ గాంచి, ప్రహర్షితాత్ముఁడై యాచోటు వెడలి చనియెను. ఇది (ద్వితీయాశ్వాసము)

ఇట్లు కళింగదేశభూములఁ బర్యటనంబు సలుపు హలాయుధుని ప్రలంబసూతియను నాలంబనాసురుఁడు పూర్వవైరమును మదిలోఁ బాటించి పంతము మీఱ నాతనిఁ దాఁకి కయ్యమునకుఁ గాలుద్రవ్వఁ, దనపుణ్యతీర్థాటనమున కాటంకము కల్గించిన యా యసురునిపై హలి కన్నుఁ గెంపు జేసి, యాతనినా సంగరమునఁ బరిమార్చెను. అంత నాసురనిమిత్రులగు రాక్షసులంతతోఁ బోనీయక బలరామునితోఁ బోర సమకట్టిరి. కాని వారలనందఱి నశ్రమంబునఁ దెగటార్చి, సుపర్వసంతతుల

గాత్రంతోను వారి యాశీర్వాదము గాంచి, మఱల దీర్ఘాయు ష్మంతులై సుఖముగాను అంతఁగళింగదేశజను లాంబలభద్రుని సం దర్శించి, సువాసనగములను సమర్పించి, కృతజ్ఞతాపూర్వక ప్రణామము లాచరించి యిట్లని ప్రార్థించిరి —"దేవా నీగురువను శ్రీరామప్రాతిమను మూకాలింగపేము నిష్ఠంటికి మయ్యెను తాపసులవలె యుండి మాయం దప్పెరు మీ కోరు వానును ప్రసాదింపుము' అని హలి 'దీనగు నిశ్చలమగు ప్రతము కావున వలెంబుఁగోరుచున్నను" వారలిట్లనిరి —"దేవా నిబిడ ప్రవాహంబును దాటి యిచ్చటి నుండి కాశి కేఁగఁ జాలము కావున్ మాకు ముదము కలుగులాగున గంగను శేవలయును ఇంక నానదీతీరమునందు శైవలింగములను నిలుపవలయును" అను నాకాలింగులపలుకు లాలించి, కాహికేయుం డు శివుం బ్రార్థించి, యామహాదేవుఁ బ్రసన్నుఁజేసికొని తత్కృపచేఁ గ్రక్కున వింధ్యశైలమునకుఁబోయి, యచ్చట నిశ్చలభక్తిని దివ్యగంగ ననేకరీతుల స్తుతమొనరించి, యమునాసరస్వతుల తో కూడ నాగంగను రాఁబ్రార్థించుచు దనహలమున వింధ్యా ద్రినాటించి మీటఁగా నాదివ్యనదీత్రయ ముద్భవించెను లాం గలీ (నాగావళి) నామముతో నొప్పునదియేగంగ "వేగవతి" యనుపేరఁబరఁగునదియే యమున ఝుంఝూవతీనామమున విరా జిల్లునదియే సరస్వతి ఇట్లుద్భవమొందిన నదీత్రయముచు దన నాగటితో దక్షిణాభిముఖముగఁ గళింగదేశభూములకుఁ దీసికొ

నివచ్చుచుండఁ *బాయకపాడుచోట నయ్యది యుత్తరవాహిని కాఁగా నాస్థలము క్షేత్రరాజమై యొప్పారునని యచ్చటి కింతకులకుఁ జెప్పి, యాతావున శివలింగం బొకదానిఁ బ్రతిష్ఠించి దానికి "సిద్ధేశ్వరలింగము" (పాటలేశ్వరలింగము) అని పేరిడెను. ఇట్లు దక్షిణదిక్కుగా లాంగలీనది సహితుఁడై వచ్చి, "గుంప' యను గ్రామమునొద్ద సోమేశ్వరలింగమును బ్రతిష్ఠించెను పిమ్మట నీఁతిగ గంగాగ్రగామియై యతిదూరముచని యొకచోట 'లాంగలియు," "వేగవతి" "ఝంఝావతి"యుఁ గలియుటఁజూచి ప్రహృష్టాత్ముఁడై యాదివ్యస్థలము రెండవ ప్రయాగ యగునని యెంచి యక్కడ నింకుధరుని నిలిపెదఁగాక యని ద్విజప్రవరులసహాయమున లింగప్రతిష్ఠగావించెను నదీత్రయము సంగమమగుచోట ప్రతిష్ఠింపఁబడినకారణమున నాదేవునకు సంగమేశ్వరుఁడని పేరు వచ్చెను (ఇది తృతీయాశ్వాసము)

పిదపఁ గృష్ణాగ్రజుఁడు తాఁదెచ్చినగంగతోఁగూడ (లాంగలీనది) కొంతదవ్వేగి కళింగదేశమున శ్రీకాకుళమను గ్రామము

---

[1] *Payakapadu* An Agraharam of 431 people on the bank of the Nagavali which contains the upper most of the five shrines built along that river and is the chief place in a Mokhasa granted by a former Maharajah of Jayapore to Bhuvaneswara Praharazu an Uria Brahman

Vizagapatam Gazetter Chapter XV P P 301
(Rayagada Taluk)

# 14 అడిదము బాలభాస్కరకవి

(క్రీ శ 1808 1874 సం)

ఈతఁడాఱువేలనియోగిబ్రాహ్మణుఁడు ఆపస్తంబసూత్ర వసిష్ఠగోత్రజుఁడు భాస్కరామాత్యపౌత్రుఁడు సూరమంత్రి పుత్రుఁడు కాపురము విజయనగరముతాలూకాలోని రెల్లివలసగ్రామము ఈతఁడు 1808 వ సంవత్సరములో జన్మ మొంది 1874 సంవత్సరములో స్వర్గస్థుఁడయ్యెను కవితావృత్తిచేఁ బ్రఖ్యాతిఁగాంచిన యడిదము వంశమునందు జన్మించిన కారణముచేత సాహిత్యోపాసకుఁడై యతఁడు తాతదండ్రుల యొద్ద విద్యాసంపాదనమునందు శిక్షితుఁడయ్యెను బాలభాస్కరకవికి సంస్కృతాంధ్రములయందుఁ జక్కని వైదుష్యము కలదు మనోహరమగు కవిత్వము చెప్పి, ప్రాజ్ఞ ప్రశస్తి గాంచినట్టి యీతనికిఁ జిన్ననాఁడే యంవడిదవారికూచుల ప్రసిద్ధ కవిపుంగవుఁడను, తన పితామహుఁడునగు సూరకవివలెఁ గవితావృత్తిచే దేశాటనము చేయుచు, జీవితమును వెళ్ళఁబుచ్చెను 19 వ శతాబ్దమధ్యభాగమునను విశాఖపట్టణమండలములోని మాడుగుల సంస్థానమును బరిపాలించిన శ్రీకృష్ణభూపతిమహారాజుచే సమ్మానితుఁడు ఈవిషయము తదాస్థాన కవివరుఁడు మంత్రిప్రగడ ప్రకాశకవిచేఁ జెప్పబడిన చాటుపద్యము వలనఁ దెలియవచ్చుచున్నది

క. పాగా గిల కిపృలిస్తేఱు
భాగొందిరి కృష్ణమూర్తి భాస్కరులు మహా
భాగులు గవ్యనురాజులు
గోగణపాలకులు మాడ్ృసభలోన.

భాస్కరకవి నాదరించి వ్వాసన మొసఁగుచు గౌరవించిన శ్రీకృష్ణభూపతిమహారాజు 10వ శతాబ్దములో నాతఁగుం చూపిన విద్యాభిమానముచే అభినవకృష్ణరాయ'లని పేర్కొనాడించిన ధన్యుఁడు. ఆ సంస్థానపు నాంధ్రకవులలోఁ బ్రసిద్ధిగన్న మంత్రిప్రగడ ప్రకాశకవియు, ఇంద్రగంటి గోపాలశాస్త్రి ప్రముఖపండితప్రవరు లనేకు లీ కృపునాస్థానము నలంకరించి యుండిరి పండితకవిప్రకాండుఁడగు శిష్టు కృష్ణమూర్తిశాస్త్రియు, అల్లమురాజు సుబ్రహ్మణ్యకవియు నీ బాలభాస్కరకవియు నాభూపాలున సమ్మానముఁబొంది, వర్షాశనము లనుభవించుచుండెడివారు కృష్ణభూపతిమహారాజు మెఱమెచ్చులదాతయని సుబ్రహ్మణ్యకవి యిట్లు వర్ణించియున్నాఁడు

సీ. బొండుమల్లెలకు సద్భూరిసౌగంధ్యంబు
చెఱకుఁగోలకు సమంచితమధురిమ
కంఠీరవమున కుగ్రప్రభావసమృద్ధి
యంచకుఁ బాలునెరెంచునేర్పు
గండుఁగోయిలకుఁ జక్కనికలధ్వనిలీల
ప్రహ్లాదునకు హరిభక్తియుక్తి
మలయానిలమునకు లలితశీతలవృత్తి
వాణికిఁ బ్రౌఢవర్యావర్ణనంబు

కం వరరత్నాంచితవలయా
“భరణి”లకరుఁడవఁటన్నుఁ బ్రస్తుతిసేతున్
దరమా? సత్కవివరులకు
సరసాగ్రణి! కృష్ణభూప! స్మరనిభరూపా!

కం ధరను “శ్రోత్రరభాద్రా”
కర! రక్షింపుము శత్రుగణములనెల్లన్
గరుణించి ప్రోచుమింకన్
సరసాగ్రణి! కృష్ణభూప! స్మరనిభరూపా!

కం “రేవతి’ యను కామినితను
సేవింపఁగఁదలఁచు సుగుణశీలిక ననుఁగుం
డై విలసిల్లెడువానిం
భావించెదఁ గృష్ణభూప! భావజరూపా!

కం తారావళియను కావ్యము
తారావళికిఁ జేఁగూర్చి తనరఁగ నిడున్
బేరుగ నొసఁగితి నిదిగొని
భూరికృపం బ్రోవు కృష్ణభూపతివర్యా!

# 15 కళ్లేపల్లి వేంకటనరసింహమూర్తి

(క్రీ శ 1864—1911 సం॥)

ఇతఁడు సృష్టికరణకులజుఁడు (ఉత్కళదేశ గౌడనియోగి బ్రాహ్మణుఁ) డా శ్వరగోత్రజుఁడు నీలాచలపౌత్రుఁడు వేంకటమాంబా వరాహానరసింహుల పుత్రుఁడు నివాసస్థలము గంజాంమండలములో "కళ్లేపల్లి" గ్రామము ఈయూరు శ్రీమణి నాగేశ్వరక్షేత్రమని శివ విచిత్రరామాయణాదికృత్యాదిని ట్లు చెప్పియున్నాఁడు

మ॥ తపనోదంచిత తేజుఁ డాదిఁ బుభద్రస్థాపితుండు స్వకీ
యపరాధ్యాఖ్యుఁడుమత్పురీనిలయుఁడున్ చింతాజగన్నాథ వి
ప్రపునస్సృష్టమహాలయుంబు పశిహపవ్యాపకుం డిద్ధస
త్యపరుండా మణినాగశంబు గు నిరుల్ దానిచ్చు నెట్టొన్కకున్

ఉ॥ ఆసరిదగ్రపూర్వతటమందు వెలింగెడు నొక్కగ్రోలు ధా
త్రీసురసేవితుం డపెతిదేవలుఁడౌ మణినాగనామకై
లాసగిరింబుఁ గుంకుటఁ గడానిధిబౌ సము సీర్వమంగళా
వాసమునై బుధుల్బ్వాగశ భాషలుఁ గళ్లెపలిసమాఖ్యచేన్

ఈ నరసింహమూర్తికిని వైష్ణవమతావలంబకుఁడని యీ కిఁబు గావించిన గురుస్తుతివలనఁ దెలియనగును

క॥ లలిమద్దేశికవరులకుఁ
గలుషేభమృగేంద్రులకు జగన్నుతచారి
త్రులకున్ శ్రీభాష్యం తిరు
మల కదుల కొనర్తు నె సమస్కృతు లెలమిన్

1 "పృథుకదరత్నా యాదవ" అను కందపద్యపాదమీఁయఁ దక్కిన మూఁడుపాదములను 5 నిమిషములలోఁ గవి యిట్లు పూరించెను

2 పృథుకదరగ్రీవగోత్ర భిత్సమయశ స

3 త్పథికాధి పరధికారా

4 డధికా విధికాస్పదవృష్ణతా రమణశౌరి

ఇట్లు తండ్రిగారు సజీవులుగ నుండఁగ ననేక సాహిత్య గ్రంథములను జదివి, కవితావిధానములందుఁ గ్రమశిక్షితుఁడై వర్ధిల్లుచుండెను అంతపిమ్మట "ఉంగరాడ" ప్రొప్రయిటరుగారి యాశ్రయమునుపొంది, వారి దాయాదుల పిల్లలకు విద్యగఱపుచు నాకాలముననే ప్రొప్రయిటరుగారి యాస్థానమున నున్న యొక పండితప్రవరునియొద్ద నలంకారశాస్త్రమును జదివి కోవిదుఁడయ్యెను మఱికొన్నిదినములు గడచినపిమ్మట ననఁగా 1883 సంవత్సరములో శ్రీకాకుళమునకు ననతిదూరములోనున్న "పాత్రునివలస" గ్రామము "కంబైండుస్కూలునకుఁ" బ్రధానోపాధ్యాయుఁడై పనిచేసెను 1889 సంవత్సరములో దొరతనమువా రేర్పఱచిన పండితపరీక్షలో నుత్తీర్ణుఁడై యోగ్యతాపత్రికను బడసెను పిదపఁ గొన్నినాళ్లు మ రా రా శ్రీ బాబూ శశిభూషణపాలితునకు (గంజాంజిల్లా స్కూళ్ల యిన్స్పెక్టరు) ఆంధ్రభాషయం దభినివేశము కలిగించి, వారిని F A పరీక్షయందుత్తీర్ణులగునటులఁ జేసెను మొత్తముమీఁద వెంకటనరసింహా

మూర్తికవిప్రవరుఁడు తన *విశకాలము గొం ాలవటికు నధ్యాపకత్వమునందే గడిపినవాఁడుగాఁ గనఁబడుచున్నాఁడు.

వెంకటనరసింహమూర్తికవి పాండిత్యప్రభావము, వినయ శౌశీల్యాదిగుణగణంబులను విని, యట్టివాని దమపోష్యఁగను నిగఁ జేకొనువేడల నుభయతారకము నుండు తలఁచి దేవబ్రాహ్మణభక్తియుక్తులును వితరణశౌర్యాదిగుణసంపన్నులును శ్రీ తిలారుహుంపా ప్రొప్రయిటరు యగు శ్రీ మాడుగుల యెఱ్ఱన్నగారు నరసింహకవిని దమయాస్థానకవిగా నియమించిరి ఆకారణముచేత నితఁడు తన జీవితకాలమందలి తుది దశను దనయాశ్రయుల నివాసస్థలమగు బొంతలకోటలోఁ గడుపుచు, గ్రంథరచనచేయుచు వచ్చెను ఇతఁడు 1890 సంవత్సరప్రాంతమున 'విచిత్రరామాయణము" అను పద్యకావ్యమును రచించి దానిని తన పోషకుఁడగు శ్రీ మాడుగుల యెఱ్ఱన్నప్రభుకంకితము చేసెను మఱియు నితఁడు శ్రీరంగశతకము, భీమేశశతకము నారసింహశతకము మున్నగుశతకములు రచించెను ఇంతియేగాక యుదారశీలుఁడగు నికవిగ్రామణి యితరుల కృతులను సవరణయొనరించుచు మాటికిఁదొంబదిపాళ్లు పద్యములను దానే రచించి, వానిని వెలయఁజేసెను అట్టివానిలోఁ జెప్పఁదగినవి "సిద్ధివినాయకచరిత్రము, వరాహచరిత్రము' అని లోకము చెప్పుచున్నది

వేం ... ... శాస్త్రి తన ఇరువదియవ వయస్సులో వాత రోగపీడితులై 1911 వ సంవత్సరము నవంబరు 11 వ తేదిని స్వర్గస్థులైరి.

విచిత్ర రామాయణము — ఇది పావనకథా మహిమగు ఉత్తమకావ్యము అనేకములగు గాదలతో నొప్పి, సార్థకనామమున విరాజిల్లుచున్నది గ్రంథము సీతావనవాసముతో నారంభము, శ్రీ రామచంద్రుని వైకుంఠపురప్రవేశముతో ముగియుచున్నది సందర్భానుసారముగ రామాయణకథాప్రశస్తాంశ మంతయుఁ గాండవిభాగముగ నిందుఁ జేర్పఁబడినది సందర్భ శుద్ధిగ నిందుఁ బ్రసిద్ధముల హరిశ్చంద్రోపాఖ్యానము మదాల సాఋతుధ్వజవృత్తాంతము మొదలగు రసవత్తరములగు గాథలు గూర్పఁబడి వెంకటనరసింహకవికి నుభయభాషలయందు ను జక్కని వైదుష్యము కలదు. బంగారమునకుఁ దావియబ్బి నట్లుగఁ బాండిత్యము కుందోడు నిరాఘాటమగు కవితాధార యు నలవడుట కారణముచే నీ విచిత్రరామాయణమునందలి కవిత్వము మృదుమధురపదగుంభితమై, సలక్షణమై యెంతయు మనోహరముగా నున్నది ఆంధ్రభారతికి నమూల్యాలంకార ముల నర్పించి, నూతనాంధ్రవాఙ్మయమునఁ దన గ్రంథనిర్మాణకౌశలముచే నున్నతస్థాన మలంకరించిన కీర్తిశేషులగు శ్రీ కందుకూరి వీరేశలింగంపంతులుగారు విచిత్రరామాయణముపై నిట్లు తమ యభిప్రాయము నొసఁగియున్నారు "విచిత్రరామా

యణమును శాంతముగఁ జదివినాఁడను. కవి యనర్గళకవితా ధారగలవాఁడనుటకుఁ జాలియున్నాఁడు. కవిత్వము పదఘటి తమయి రసవంతమును హృద్యమునై సులభముగా నున్నది. గ్రంథ ము మొత్తముమీఁద సలక్షణముగా నున్నది. సందర్భశుద్ధి చక్కఁగా నున్నది" (కందుకూరి వీరేశలింగము)

కవిధారణి తెలియుటకునై యేతద్గ్రంథమునుండి కొన్ని పద్యము లిందుఁ బొందుపఱచుచున్నాఁడను

మ. అని వాల్మీకి తన స్తుతిన్ శ్రవింపక్రాంతుఁడై భక్తిపొం
ది విజాగారము నుండి వచ్చి మునులన్ దిక్కుల్ తేజస్కులన్
గని భక్తిం బ్రణమిల్లి యెత్తులకుమప్పుర్మోడ్చి సౌంబా
పిని రక్షింపుఁడు నన్నటంచు వలికెన్ విష్ణునసంయుక్తుఁడై
(బాలకాండము)

ఉ. తనభటవర్గమిట్టులు కృతాంతకు ప్రోలికిఁ బంపె ఖసం
జనితమహోగ్రహుంకృతుల నుద్ధతనాభృతవిద్యారాజసం
గమునఁ బూని మునీంద్రుఁడై జమదగ్ని శిరంబుఁ గృపాణపాణియై
తానిమిచనెంబురంబునకు మూర్తిగ జచుని కృతఘ్నుఁడాగదా!
(బాలకాండము)

మ. సమగాటోపనిశాటరుద్ధ పథిమయ్యుగ్రావసందోహదు
ర్గమమాశీవిషసంకులంబు ఘనగాంతార మత్యుగ్రమా
ప్రమదారత్నము నాసలో వెతలకోపంజాలవో బాల! యా
క్రమమూలంబులఁ గందమూలములఁ బ్రొద్దుంబుచ్చఁగా
నయ్యోయన్ (అయోధ్యాకాండము)

మ సాంద్రయశస్సు డిక్ష్వాకుల సత్తముఁ డుత్తముఁ డాత్రిశంకురా
జేంద్రజుఁ డాశ్రితామరమహీజుఁడు తథ్యవచోనురక్తుఁడా
చంద్రమతీకళత్రుఁ డు భుజాబలనిర్జితశత్రుఁడౌ హరి
శ్చంద్రమహీశుఁ డెల్లపుడు సత్యమె పల్కుచునుండు ధాత్రిలోన్
(అరణ్యకాండము)

శా వాలాగ్రంబునఁ జుట్టియున్నినుఁ జతుర్వారాసులన్ముంచు న
వ్వాలిం బ్రాభవశాలిఁ గీలి నిభశుంభత్తీవ్రబాణంబునన్
నేలంగూలిచె నమ్మహారథుని యింతిం దెచ్చితీ వింకఁ ద
త్కాలాగ్నిప్రతిమానబాణముల మ్రగ్గంబోదు మా కేమనన్

మ అజహల్లక్షణతన్వెలుంగుచు సదాయన్విష్ణునందుండి త
న్నిజలీలార్థముగా వెలిన్వెలసి తండ్రే! చేతనాచేతన
ప్రజమొప్పం జిదచిత్తదిశ్వసులన్ భాసిల్లె బ్రహ్మంబు న
య్యజరుద్రాదులెఱుంగరియెఱుక బ్రహ్మజ్ఞానమూలంబగున్
(ఉత్తరకాండము 117)

ఇది ప్రథమభాగము.

# ఆంధ్రవిజ్ఞాన సమితి,

## విజయనగరము

**అధ్యక్షులు, కోశాధిపతులు**

రావుసాహెబు వేపకొమ్మ జి సుబ్బయ్యపంతులుగారు,

బి ఇ యం ఐ ఇ,

చీఫ్ ఇంజనీయరు శ్రీ విజయనగరం ఎస్టేటు

**ఉపాధ్యక్షులు**

అడిదము రామారావు పంతులుగారు,

రిటైర్డు సీనియరు తెలుగు పండిట్, శ్రీ మహారాజా వారి కాలేజి

**కార్యదర్శి**

గంటి సూర్యనారాయణశాస్త్రి,

**కృత్యసమాలోచన సమితి**

మహామహోపాధ్యాయ, కళాప్రపూర్ణ,

తాతా సుబ్బారాయశాస్త్రిగారు,

శ్రీమాన్ పరవస్తు రామానుజస్వామిగారు, యం ఏ,

ప్రిన్సిపాల్ శ్రీ మహారాజావారి సంస్కృత కళాశాల

శ్రీమాన్ టి నరసింహాచార్యులుగారు, ఎం ఏ యల్ టి,

లెక్చరర్ భాషాశాఖ శ్రీ మహారాజావారి కాలేజి

డాక్టరు, బుర్రా శేషగిరిరావు పంతులుగారు,

యం ఏ, పిహెచ్ డి,

కుండి వేంకట శాస్త్రిగారు,

పండితులు, శ్రీ మహారాజావారి సంస్కృత కళాశాల,

ఆంధ్ర యూనివర్సిటి సెనెటు, ఎకడమిక్కౌన్సిలు, బోర్డాఫ్ స్టడీసు సభ్యులు

# సమితి యుద్దేశములు

ఆంధ్రవాఙ్మయ ప్రపంచమున నింతవరకెన్నియో యుద్గ్రంథములు వెలువడియున్నవి, వెలువడుచున్నవి అవి యన్నియు ఆంధ్రవిజ్ఞానాభివృద్ధికి సహకారములగుచున్నను, ఆంధ్రవిజ్ఞానసరస్వతిని ఆంధ్రావనిలో సర్వతోముఖముగ ప్రవహింపజేయదలంచి, మేమీ "ఆంధ్రవిజ్ఞానసమితి" ని నెలకొల్పినారము

ఇందు ప్రాచీనాధునిక సారస్వత, చారిత్రిక, నైతికాది సంబంధ బంధురములగు ప్రాచ్య గద్య పద్యగ్రంథములు, సంవత్సరమునకు నాలుగింటికి తక్కువగాకుండగ ప్రచురించ నిశ్చయించితిమి

శాస్త్ర సంబంధములగు ప్రాచీన గ్రంథములను, రసపరిపూర్ణములగు ప్రాచీన ప్రబంధరాజములను, అధునాతన కవిపుంగవులు, విద్వాంసులు, కళాభిజ్ఞులునగువారిచే రచియింపబడిన ప్రజోపయోగములైన గ్రంథరాజములను మాసమితికి పంపిన, వాటిని సవిమర్శనముగ పరిశీలించి, ముద్రణార్హములగునేని వాటిని ముద్రించుటకు ప్రయత్నించెదము ఇంతియెగాక, ముద్రితగ్రంథములవలన లభించులాభములో కొంతపాలు తద్గ్రంథాధికారికి గోరిచో లభింపగలదు

సమితి యాదాయమంతయు, గ్రంథప్రచురణకు, గ్రంథకర్తలకు, ప్రాచీన గ్రంథసంపాదనకు వినియోగింపబడును, గాన ఆంధ్ర భాషాభిమానులు, ఆంధ్ర భాషోద్ధారకులు, ఆంధ్ర విజ్ఞాన సంవర్ధకులగు ఆంధ్రమహాశయులు మాయీ సమితిలో పోషకులుగను, చందాదారులుగను, జేరి, మా యుద్యమమునకు చేయూత నొసంగి, మాకుతోడ్పడి భాషాభివృద్ధిని చేయుదురుగాక యని యాశించుచున్నారము

# నిబంధనలు

పోషకులు:— సంవత్సరమునకు 10- రూపాయిలు తక్కువగాకుండ నిచ్చువారు యీసమితికి పోషకులుగ పరిగణింపబడుదురు సమితినుండి వెలువడిన గ్రంథములన్నియు వినామూల్యముగ పొందగలరు

చందాదారులు — సంవత్సరమునకు 1-రూపాయిలు ముందుగా నిచ్చువారు చందాదారులుగ నుండవలెను సమితివారి లాభాభ్యుదయముల ధరించి గ్రంథముల నందింపజేయుదురు

చందా నిచ్చువారు తప్పక రశీదును పొందవలెను చందాసొమ్ము అధ్యక్షుని పేరిట పంపవలెను గ్రంథములు వి. పి. గా పంపబడవు

చందాదారులుగా చేరని యితరులకు రవాణాఖర్చులుగాక గ్రంథము 2 రూపాయిలకు లభించగలదు

ఆంధ్రవిజ్ఞానసమితి ప్రథమ గ్రంథరాజము

# రాధామాధవసంవాదము

వెలిదండ్ల వేంకటపతి మహాకవి ప్రణీతము శృంగార రసభరితము

(1700 సంవత్సరపు కృతి)

విక్రమ సంవత్సరారంభమున వెలువడినది

ఆంధ్రవిజ్ఞాన సమితి - ద్వితీయగ్రంథరాజము

# విస్మృతకళింగాంధ్రకవులు

కృతికర్త అడిదము రామారావు పంతులుగారు

ఆంధ్రసారస్వతాభ్యుదయ కారకులగు మహాకవుల జీవితచారిత్రాదికములను కీ. శే. కం. వీరేశలింగం, గు. శ్రీరామమూర్తి పంతులువారలు తమకు లభ్యమైనంతవరకు స్వీకరించి, ముద్రించిరి వారలకు లభ్యముకానట్టి యీక్రిందనుదాహరించి కవిపుంగవుల జీవితవృత్తాంతములను, వారల గ్రంథములను సంపాదించి, సవిమర్శనముగ వారివారి చరిత్రములను వ్రాసి యీసమితి ద్వితీయ గ్రంథముగ ప్రచురించు మన్నారము ఈ గ్రంథము గద్యపద్యాత్మకమై సకల జనానందకరమై వెలయుచున్నది

